# Calling all Whiz Kids!




**It's easy! It's fun!!**
**There are over 100 fabulous prizes to be won!!!**

All you have to do is tick off the right answers to the five questions given, tell us why you Cherry Blossom your shoes every day, and mail the entry form to us, duly completed and accompanied by the inner foil of one 40gm Cherry Blossom tin or the foils from two 15gm Cherry Blossom tins. And you could win one of many fabulous prizes!

# Sound Prizes From H.M.V.

1 Prize



* HMV Stereocorder

2 Prize



* HMV Stereo 1515

3 Prize



* HMV Stereo 1010

100 Consolation Prizes



* HMV Orbit 404

First, second and third prizes may be exchanged for other HMV products of equivalent cost.

## Every Entrant Wins!

A fabulous discount coupon on HMV players (Fiesta, Popstar and Swinger) for all entries received before 30th May, 1982.

## RULES

1 The contest is open to school children only (up to Class XII). This will be verified for all award winners. Contestants should be residents of the Indian Union. 2. You may send in as many entries as you wish but each entry must be accompanied by 1 inner aluminium foil from a 40gm Cherry Blossom tin or 2 foils from 15gm tins of Cherry Blossom. 3. Entries should be addressed to the Advertiser, Cherry Blossom Whiz Quiz, P.O. Box No. 9192, Park Street, Calcutta 700 016. Registered mail will not be accepted. 4. Last date of receipt of entries is 15-6-1982. Illegible, incomplete and late entries will be disqualified. 5. The decision of the judges will be final and binding. No correspondence will be entertained. In the event of a tie, the value of the prizes will be equally divided among the winners. 6. Children of the employees of Reckitt & Colman of India Ltd. and Lintas . India are not eligible to join the contest.

## ENTRY FORM

1. Who sang the song "Mera Joota hai Japani"?
   ☐ Lata ☐ Mukesh ☐ Kishore
2. Behind a rider's shoe is a piece of metal which is used for prodding the horse. What is it called?
   ☐ Spear ☐ Spur ☐ Goad
3. A fairy tale character lost her glass slipper. Who was she?
   ☐ Snow White ☐ Cinderella ☐ Red Riding Hood
4. What is the first name of the Indian Film heroine whose last name is also a style of footwear?
   ☐ Rekha ☐ Padmini ☐ Poonam
5. Listed below are 9 qualities of Cherry Blossom. Select the 7 you feel are most important and rank them from 1 to 7 in what you feel is their order of importance by putting the rank in the box provided.
   - ☐ Has an International formula
   - ☐ Nourishes leather
   - ☐ Gives a longer lasting shine
   - ☐ Is economical
   - ☐ Is easy to use
   - ☐ Contains imported waxes
   - ☐ Gives a mirror shine
   - ☐ Makes shoes last longer
   - ☐ Keeps leather soft.

Please complete the following sentence in not more than 10 words (English or Hindi)

I Cherry Blossom my shoes every day because

मैं अपने जूते रोज़ चेरी ब्लॉसम से चमकाता हूँ क्योंकि

____________________

____________________

Name: ________________

Address: ________________

____________________

Entries should reach us at the following address on or before 15.6.82: The Advertiser, Cherry Blossom Whiz Quiz, P.O. Box No: 9192, Park Street, Calcutta – 700 016.




# Did you Cherry Blossom your shoes today ?

LINTAS(C)/CB/25/1831

జెమ్స్‌తో పొదిగాగా నా నావ
పయనిస్తా దాన్లో అద్భుత లోకంలో
తెస్తానిక మరెన్నెన్నో జెమ్స్
నీకోసం నాకోసం మనకోసం



చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని !

క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

OBM/8341

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["న్యాయనిర్ణయం"]కు ఆధారం వల్లూరు బాబురావు రచన. మనిషి తన బాగుకోసం తాపత్రయపడడం తప్పుకాదు. కాని, అందుకోసం మితిమీరిన స్వార్థబుద్ధితో, యితరులకు కీడుచేయడం నీతిమాలినపని అవుతుంది. ఈసత్యం, "స్వార్థానికి శిక్ష" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

పుస్తకస్థా తు యా విద్యా, పరహస్తగతం ధనమ్,
కార్యకాలే సముత్పన్నే, న సా విద్యా న తద్ధనమ్.

[పుస్తకంలోవున్న విద్య, స్వయంగా పాండిత్యం ప్రదర్శించవలసి వచ్చినప్పుడు అక్కరకు రాదు; యితరులకు యిచ్చిన ధనం అవసరవేళ అందుబాటులో వుండదు. అందువల్ల రెండూ వ్యర్థమే!]

సంపుటి 70 జూన్ '82 సంచిక 6

విడి ప్రతి : 1–75 :: సంవత్సర చందా : 21-00






CHITRA



# గెలుపు రహస్యం

రాజు చంద్రసేనుడి ఆస్థానంలో వుండే సర్వమిత్రుణ్ణి, మాటల్లో ఎవరూ గెలవలేక పోయేవారు. రాజు అతడిచేత చమత్కారంగా మాట్లాడించి వినోదించేవాడు. ఒకసారి ఆయనకు సర్వమిత్రుడి కన్న మాటకారులెవరన్నా వున్నారేమో తెలుసుకోవాలనిపించింది. అందుకేం చేయాలని ఆయన సర్వమిత్రుణ్ణే సలహా అడిగాడు.

"మాటల్లో నన్ను గెలిచినవారికి వంద వరహాలు బహుమతి ప్రకటించండి. బహుమతికి ఆశపడి అడ్డమైనవాళ్ళూ పోటీకిరాకుండా ఓడినవాళ్ళకు వెయ్యి వరహాల జరిమానా అనండి. అందరూ అంత డబ్బిచ్చుకోలేరు కాబట్టి, అలాంటి వాళ్ళకు, పది కొరడా దెబ్బలశిక్ష విధించండి," అన్నాడు సర్వమిత్రుడు.

రాజుకు యీ నియమావళి బాగా నచ్చింది. దీన్ని గురించి ఆయన దేశమంతటా ప్రకటన చేయించాడు. అది విని చాలామంది రాజధానికి తరలి వచ్చారు. మొదటి రోజునే అలా వచ్చిన వాళ్ళు వందమందిదాకా వున్నారు.

షరతు ఎంత కఠినంగా వున్నప్పటికీ యింతమంది తెగించి వచ్చారంటే, వాళ్ళల్లో కొందరైనా మంచి తెలివిగల వాళ్ళూ, మాటకారులూ అయుండాలి. మిగతావాళ్ళు డబ్బాశకొద్దీ మొండి ధైర్యంతో వచ్చివుంటారు!

ఇలా ఆలోచించి సర్వమిత్రుడు, రాజును పోటీకి పది రోజులు గడువు అడిగాడు. ఆ పది రోజుల్లో అతడు మారువేషంలో పోయి అందరినీ కలిసి మాట్లాడాడు. మాటకారితనంలో సర్వమిత్రుడి గొప్పతనం గురించి చెప్పి, వాళ్ళను బెదరగొట్టాడు. చాలామంది వచ్చిన దారి పట్టారు.

"వసుంధర"

పోటీకి వచ్చినవాళ్ళల్లో గుణశీలు డనే వాడు చాలా తెలివైనవాడుగా సర్వమిత్రు డికి కనిపించాడు. మాటల్లో తను అతడితో నెగ్గలేనని కూడా అనుమానం కలిగింది. ఒకసారి ఓడడం జరిగితే రాజిక తన ముఖం చూడడు.

సర్వమిత్రుడు తానెవరైందీ, గుణశీలు డికి చెప్పి, పోటీల్లో పాల్గొనని పక్షంలో రెండు వందల వరహాలిస్తానన్నాడు. గుణ శీలుడు పేదవాడు కావడంతో, పోటీకంటే యిదే నయమనిపించి, డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు. మిగతావారందరినీ సర్వ మిత్రుడు పోటీలో అవలీలగా ఓడించి, రాజు వద్దనుంచి పెద్ద బహుమానం తీసు కున్నాడు.

కొద్ది నెలలు గడిచాక రాజు మళ్ళీ పోటీ ఏర్పాటు చేశాడు. ఈ సారికూడా పోటీకి గుణశీలుడు వచ్చాడు. సర్వ మిత్రుడు రెండు వందల వరహాలిస్తా నంటే, గుణశీలుడు చాలదన్నాడు. ఆఖ రుకు అయిదు వందల వరహాలు తీసుకుని అతడు వెళ్ళిపోయాడు. సర్వమిత్రుడు మిగతా వారిని ఓడించి రాజునుంచి మళ్ళీ బహుమానం పుచ్చుకున్నాడు.

మూడోసారి పోటీ ఏర్పాటయింది. గుణ శీలుడు ఉత్సాహంగా బయలుదేరాడు. అతడి తండ్రి, "రెండుసార్లు వెళ్ళి డబ్బు



సంపాదించుకువచ్చావు. రాజులతో వ్యవ హారం ప్రమాదం. జాగ్రత్త, నాయనా!" అన్నాడు.

"అసలు నేనింతవరకూ పోటీలో పాల్గొననేలేదు!" అంటూ గుణశీలుడు తండ్రికి జరిగినదంతా చెప్పాడు.

తండ్రి ఆశ్చర్యపోయి, "వెర్రివాడా! నీకు మాటల్లో వున్న తెలివితేటలు, లోక వ్యవహారంలో లేదు. సర్వమిత్రుడు నీ మాటకారితనానికి భయపడే డబ్బిస్తు న్నాడు. ఈసారి నువ్వు పోటీకి రాజు దగ్గరకు తప్పకుండా వెళ్ళు. సర్వమిత్రు డిచ్చే డబ్బు అంటకు. పోటీలో గెలిచి రాజు ప్రాపకం సంపాయించుకో," అన్నాడు.

ఈసారి సర్వమిత్రుడు, గుణశీలుడికి వెయ్యి పరహాలిస్తానన్నాడు. గుణశీలుడు వద్దన్నాడు. అతడివల్ల తనకు ప్రమాదం తప్పదని భయపడిన సర్వమిత్రుడు, రాత్రికి రాత్రి తన మనుషుల ద్వారా అతణ్ణి బంధించి, ఒక అరణ్యప్రాంతాన వదిలిపెట్టించాడు. గుణశీలుడు అక్కణ్ణించి తిరిగి వచ్చేసరికి పోటీలు అయిపోయాయి.

ఆ తర్వాత గుణశీలుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని, ఒక్కసారి కూడా సర్వమిత్రుడు అతణ్ణి పోటీలో పాల్గొననివ్వలేదు. నానాటికీ గుణశీలుడి పంతం పెరగసాగింది. అతడు మారువేషంలో వెళ్ళినా, తెలివితక్కువగా మాట్లాడినా కూడా సర్వమిత్రుడు అతణ్ణి గుర్తించగలుగుతున్నాడు.

అప్పటికి పోటీలు పదిసార్లు జరిగాయి. పదకొండవ పర్యాయం గుణశీలుడు వచ్చిన జాడ సర్వమిత్రుడు తెలుసుకోలేక పోయాడు. తీరా పోటీ సమయంలో అతడు పోటీదారుల మధ్య కనిపించేసరికి సర్వమిత్రుడికి గుండెదడ పుట్టింది.

ముందుగా పోటీదారులమధ్య, వారిలో వారికి పోటీ ఏర్పాటయింది. గుణశీలుడు వాళ్ళతో, "ఒకసారి నేను కీకారణ్యంలో నడుస్తూండగా, ఎదురుగా ఆరడుగుల పెద్దపులి కనిపించింది," అన్నాడు.

"నిజంగానా!" అన్నారు పోటీదారులు అందరూ ఆశ్చర్యంగా.



"మీరడగవలసిన ప్రశ్న అది కాదు. ఎలా బతికి బయటపడ్డావూ అని—అవునా ?" అన్నాడు గుణశీలుడు.

రాజు చిన్నగా చప్పట్లు చరిచి, "ఆహాఁ!" అన్నాడు.

అప్పుడు గుణశీలుడికీ, సర్వమిత్రుడికీ పోటీ ప్రారంభమైంది.

"ఎదటివాళ్ళకు ఏ ప్రశ్న వెయ్యాలో బాగానే చెప్పావు. అసలు నీ కెలాంటి ప్రశ్న వెయ్యాలో తెలుసా ?" అన్నాడు సర్వమిత్రుడు.

"నా ప్రశ్న సంగతి తర్వాత చెబుతాను. ఇప్పుడే ఒక సంగతి చెప్పి, దానికేం ప్రశ్న వెయ్యాలో కూడా చెప్పాను. అదే సంగతి నీకు మరోసారి చెబితే, ప్రశ్న అడగడంలో నీ వేమైనా తెలివితేటలు చూపగలవా?" అన్నాడు గుణశీలుడు.

"చెప్పి చూడు, నీకే తెలుస్తుంది." అన్నాడు సర్వమిత్రుడు హేళనగా.

"ఒకసారి నేను కీకారణ్యంలో నడుస్తూండగా, ఎదురుగా అరడుగుల పెద్ద పులి కనిపించింది." అన్నాడు గుణశీలుడు.

"అప్పుడు నువ్వెలా బతికి బయట పడ్డావు ?" అన్నాడు సర్వమిత్రుడు.

"అది సామాన్యమైన తెలివిగలవాళ్ళు వెయ్యాల్సిన ప్రశ్న. నీబోటివాడైతే, అసలు కీకారణ్యంలోకి నువ్వెందుకు వెళ్ళావు అని అడగాలి. అవునా?" అన్నాడు గుణశీలుడు.



రాజు కుతూహలంగా, యీ సంభాషణ వింటున్నాడు. గుణశీలుడు చెప్పినట్టే సర్వమిత్రుడు అడిగాడు.

"ఎందుకేమిటి ? ఈ పోటీలకు నన్ను రానివ్వకుండా ఒకడు అడ్డు పడుతున్నాడు. అందుకని ఎవరికీ తెలియని, యీ కొత్త మార్గం ఎన్నుకున్నాను," అన్నాడు గుణశీలుడు.

సర్వమిత్రుడికి ముచ్చెమటలు పోశాయి. గుణశీలుడు తెలివిగా తన నేరాన్ని బైటపెట్టే ప్రయత్నం చేస్తున్నాడు. తను యీ ఎత్తుకు, పై ఎత్తు వేయాలి!

"నువ్విలాంటి జవాబిస్తావని, నాకు తెలుసు. నువ్విక్కడికి రాకుండా అడ్డు పడుతున్నవాడు సర్వమిత్రుడని కూడా అనగలవు! సరే, ఆ పెద్దపులి బారినుంచి నిన్ను నీవెలా రక్షించుకున్నావో చెప్పు." అన్నాడు సర్వమిత్రుడు.

"పెద్దపులి నెదిరించి పోరి, ప్రాణాలతో బయటపడేందుకు, నేనేం వీరుణ్ణి కాను! అది నాకేసి రాబోతున్నంతలో, హఠాత్తుగా పొదల చాటునుంచి, నీ కొడుకూ, ఇద్దరు నౌకర్లూ నన్ను యిక్కడికి రాకుండా మరొకసారి పట్టి బంధించేందుకు బయటికి వచ్చారు. పులి నన్ను వదిలి, అందుబాటులో వున్న వాళ్ళ మీదికి దూకింది. ఆ అదనులో నేను పారిపోయి, యిక్కడికి చేరాను," అన్నాడు గుణశీలుడు.

కొడుకు పులివాత పడినమాట వింటూనే సర్వమిత్రుడు చిన్నగా అరిచి, కుప్పకూలిపోయాడు. రాజుతోపాటు అందరూ అమితాశ్చర్యం చెందారు. రాజు ప్రశ్నించగా గుణశీలుడు, సర్వమిత్రుడి దురాగతాలను గురించి చెప్పాడు.

రాజు అప్పటికి సభచాలించి, లోగడ పోటీలకు వచ్చిన కొందరిని విచారించగా, గుణశీలుడు చెప్పింది నిజమని తేలింది. ఆయన సర్వమిత్రుడికి కారాగారశిక్ష విధించి, గుణశీలుడికి తన ఆస్థానంలో ఉద్యోగమివ్వడమేకాక, మాటకారితనం పోటీలు జరపడం మానుకున్నాడు.






## 8

[శత్రువుల మీదికి నరవాహనుడూ, సమరసేనుడూ దాడి బయలుదేరారు. పట్టణం వెలుపలి మైదానంలో ఘోరమైన యుద్ధం జరిగింది. విజయం సమరసేనుడిదే అయినా, అతడు తీవ్రంగా గాయపడిపోయాడు. నరవాహనుడు రాజుగా ప్రకటించుకున్నాడు. శివదత్తుడు అనుచరులతో, రహస్యద్వారం నుంచి బయటికి పారిపోదలిచాడు. తరవాత—]

మందరదేవుడు, శివదత్తుడి మాటలకు ఆశ్చర్యపడుతూ, "ఆ రహస్య ద్వారం నుంచి ముందెన్నడూ మీరు ప్రయాణించ లేదా ?" అని ప్రశ్నించాడు.

శివదత్తుడు నిరుత్సాహంగా తలపంకించి, "అలాంటి అవసరం అంతకు ముందెన్నడూ నాకు కలగలేదు. కాని తీరా రహస్య ద్వారం తెరిచింతరవాత ఆ కారుచీకటిలో దివిటీల సహాయం లేందే నడవటం సాధ్యమయే పనికాదని తెలుసుకున్నాను. నా తొందరలో నేను వాటి మాట మరిచిపోయినా, నా అనుచరులు తగు జాగ్రత్తలోనే వున్నారు. వాళ్ళు తక్షణం కొన్ని దివిటీలు వెలిగించి, సొరంగంలోకి దిగారు. నేనూ దిగాను. అంతలో నా వెనుక వున్న ఒకడు "శివసేనానీ, శత్రువులు కోటలో ప్రవేశించారు. వినండి, ఆ కోలాహలం!" అన్నాడు.




''సరే, ద్వారం మూసివెయ్యి. నరవాహనుడు వచ్చేవరకూ, వాళ్ళకు యీ రహస్య ద్వారం సంగతి తెలీదు. ఈ లోపల మనం సురక్షితంగా బయటపడవచ్చు, భయంలేదు!'' అన్నాను.

ఆ చీకటి సొరంగంలో కొంత దూరం నడిచేసరికి, మా దారికి అడ్డంగా వేలాడుతున్న ఒక ఇనప గొలుసు కనిపించింది. తలయెత్తి చూశాను. అక్కడ సొరంగం పై భాగాన ఒక పెద్ద తలుపు అమర్చబడి వుంది. గొలుసు కొంచెంగా లాగి చూసేసరికి, బుస్సుమని పెద్దగా శబ్దం చేస్తూ నీరు లోపలికి ఉరికింది. ఆ క్షణంలో గొలుసుతో బంధించబడిన ఆ తలుపు అక్కడ అమర్చబడిన కారణం ఏమిటో నాకు అర్థమైంది.

ఒకవేళ శత్రువులు రహస్య ద్వారం ఎక్కడ వున్నదీ గ్రహించి వెంటపడితే, ఆ తలుపును గొలుసు సహాయంతో కిందకు దించటం ద్వారా, వెనుక భాగానవున్న మొత్తం సొరంగాన్ని జలమయం చేయవచ్చు! ఇది చక్కని ఉపాయంగా తోచింది. దీనిని అమలుచేయవలసిన అవసరం ఏమైనా వున్నదా అన్న అనుమానంతో రహస్య ద్వారంకేసి చూశాను. నా అనుమానం ధృవపడింది. అక్కడ కొన్ని దివిటీలు చీకట్లో కదుల్లాడటం నాకంట పడింది. అంటే, శత్రువులు, నా ఆచూకీ తెలుసుకున్నారన్నమాట! ఇక వెనుక ముందులు ఆలోచించేందుకు కాలం లేదు. నా బలం కొద్దీ, ఆ తలుపుకు వున్న గొలుసు లాగాను. దభీమంటూ తలుపు సొరంగానికి అడ్డుగా పడటం; ఆ వెనక గర్జిస్తూ జలపాతం కిందకు దూకటం వినబడింది.

ఇక ఇప్పుడు చేయవలసింది సాధ్యమైనంత తొందరగా సొరంగంనుంచి బయటపడటం. ఆలస్యం జరిగితే, నరవాహనుడు, అడవిలో వున్న దాని రెండవ కొసను తన సైనికులతో చుట్టుముట్టవచ్చు. అలా జరిగితే, నా పనీ, నా అనుచరుల

పనీ, బోనులో చిక్కిన ఎలుకల చంద మవుతుంది.

కొద్దిసేపట్లో మేం సొరంగం ఆవలి కొసను చేరాం. అక్కడ సొరంగం అడుగు భాగాన్నుంచి కొన్ని మెట్లు అంచెల క్రమంలో పైకి కట్టబడినై. అలికిడి కాకుండా ఆ మెట్లెక్కి, అక్కడ వున్న ద్వారానికి చెవి ఆనించి, ఆవల నుంచి ఏమైనా అలికిడి వినబడు తుందేమో అని వినసాగాను.

కొద్దిసేపటివరకూ అంతా నిశ్శబ్దంగా వుంది. ఇక మానుబోదెలో అమర్చబడి వున్న రహస్య ద్వారం తెరిచి బయట పడటం క్షేమమనుకున్నాను. నేను ద్వారం మీద చేయివేసి, తుప్పు పట్టి వున్న గడియలను కదిలించేటంతలో, అవతలినుంచి గుర్రం సకిలించిన ధ్వనీ, మనుషుల మాటలూ వినిపించినై.

"అంతా భద్రంగానే వుంది. మాను బోదెలో ఉన్న రహస్య ద్వారం మూసే వుంది," అన్నాడొకడు.

"ఓహో, అలాగా! అయితే, ఆ ద్రోహులందరూ, సొరంగంలో నీటబడి, ఎలుకల్లా చచ్చివుంటారు!" అన్నాడు మరొకడు.

మళ్ళీ కాసేపు మాటలేమీ వినబడ లేదు. నేనేమి చేయటమా అని ఆలో




చించేటంతలో, కొంతదూరం నుంచి కఠిన మైన అధికార స్వరంతో ఒక గొంతు కంచులా మోగింది:

"ఇంత దూరంలో నిలబడి కబుర్లా డితే లాభంలేదు. ఆ ద్రోహులు చచ్చారో లేక మనకన్న ముందుగా ద్వారంనుంచి బయటపడి, అడవిలోకి పారిపోయారో మనకు తెలీదు. పైగా చచ్చినా, బతికినా ఆ శివదత్తుడి తల తేగలిగితే, ఒక సామంత రాజ్యం ఇస్తానని రాజు నర వాహనుడు నాకు వాగ్దానం చేశాడు."

"అయితే, ఇప్పుడేం చేయమని మీ ఆజ్ఞ!" అని ఒకేసారి రెండు గొంతులు భయపడుతూ ప్రశ్నించినై.

"వెళ్ళి, ఆ చెట్టు బోదెలో వున్న రహస్య ద్వారం తెరిచి చూడండి. ఆ వెనకవున్న సారంగం నీటిమయమయి వుంటే ఇప్పట్లో అతడి శవం కూడా మనకు దొరకదు. అలా కానప్పుడు....''

అతడు మాట ముగించకముందే, ద్వారం పక్కనుంచి భయంకరమైన సింహగర్జన వినిపించింది. ఆ వెంటనే మరికొన్ని చిన్నా పెద్దా గర్జనలు మార్మోగినై. మాట్లాడుతున్న నరవాహనుడి సైనికులు వెనుకకు తగ్గుతున్న సూచనగా గుర్రాల సకిలింపులూ, వాళ్ళ హెచ్చరికలూ వినిపించినై.

"ఆ మాను బోదె పక్కన ఏవో సింహాలు వున్నట్టుంది. ప్రమాదం, వెనక్కు తగ్గండి!'' అంటూ ఒకడు అరిచాడు. ఆ వెంటనే వాళ్ళ నాయకుడి కంఠనాదం మారుపలికింది:

"ఒక్క సింహాలేకాదు, ఏనుగులూ, ఎలుగుబంట్లూ వున్నా పని పూర్తికానిదే వెనక్కు తిరిగేందుకు వీలులేదు. పిరికి పందలు నా కత్తికి బలి కాగలరు, జాగ్రత్త!''

ఆ తరవాత సింహాలు వాళ్ళ మీదికి లంఘించినవన్న సూచనగా, భయంకరమైన గర్జనలూ, గుర్రాల తొక్కిసలాటా, సైనికుల కేకలూ వినిపించినై. నేను నా సహచరులతో సారంగంనుంచి బయట పడాలంటే, యింతకన్న మంచి తరుణం మరి రాదనిపించింది.



నరవాహనుడి సైనికులు సింహాలను హతమార్చిం తరవాత, నన్నూ, నా అను చరుల్నీ హతమార్చేందుకు తప్పక సొరంగ ద్వారాల దగ్గరకు రాగలరు.

నా అనుచరులతో వున్న పరిస్థితి, అంత ఎక్కువ ప్రమాదం లేకుండా, కొందరమైనా బతికి బయట పడాలంటే, చేయవలసిన పనీ చెప్పాను. నరవాహనుడి సైనికులు, సింహాలతో గొడవపడే సమ యమే, మనకు వాళ్ళను ఎదుర్కొనేందు గ్గాని, లేక పారిపోయేందుగ్గాని, మంచి అదనని అందరూ అంగీకరించారు.

ఆ సమయంలో నాయకుడుగా నా మీద వున్న గొప్ప బాధ్యత నన్ను చాలా కలవర పరిచింది. ఇప్పుడు నేను, నా అనుచరులకు యిచ్చే సూచనల మీదా, ఆజ్ఞల మీదా - మా అందరి భవిష్యత్తూ ఆధారపడివుంది. నాతోపాటు, నా అనుచరులకూ కూడా మరణమో లేక సురక్షిత ప్రదేశానికి పారిపోగల అవకాశమో - ఏదో ఒకటి యిక కొద్ది నిమిషాల్లో తేలిపోతుంది.

నేను, యిక ఏమాత్రం ఆలస్యం లేకుండా రహస్య ద్వారం తెరిచాను. తుప్పు పట్టివున్న ఆ ద్వారాలు కిర్రుమని ధ్వని చేస్తూ తెరుచుకున్నవి. బయటికి చూతునుగదా - అక్కడ జరుగుతున్న గందరగోళం చాలా భీభత్సంగా కన బడింది.

సింహాలు, ఒకటి కాదు రెండు కాదు- దాదాపు చిన్నా పెద్దవి ఐదారు కలిసి




CHITRA

సైనికులు ఎక్కివున్న గుర్రాల మీద కలియబడినై. సైనికులు దాదాపు ఒక యిరవైమంది వరకూ వుంటారు. వాళ్ళు చెట్ల మధ్య చిక్కుకుపోయి, భయంకరంగా గర్జించి మీదికి దూకుతున్న సింహాల పంజా దెబ్బలనుంచి పారిపోలేకా, తమ చేతనున్న యీటెలతో వాటిని చంపలేకా - నానా గగ్గోలూ పడిపోతున్నారు.




అల్లంత దూరాన గుర్రం మీద కూచునివున్న వాళ్ళ నాయకుడు, చేతి కత్తిని గాలిలో గిరగిరా తిప్పుతూ, ''భయపడకండి, హతమార్చండి, చంపండి!'' అంటూ అరుస్తున్నాడు. కాని, అతడు మాత్రం ఆ సింహాలను ఎదుర్కోవటం లేదు సరిగదా, అంత ప్రమాదం తటస్తపడితే పారిపోయేందుకు సిద్ధంగా గుర్రాన్ని వెనక్కు నడుపుతున్నాడు.

నేను, నా అనుచరులతో సొరంగ ద్వారం నుంచి బయట పడటం, నరవాహనుడి సైనికులుగాని, వాళ్ళ నాయకుడుగాని గమనించలేదు. వాళ్ళ దృష్టి ప్రాణరక్షణ చేసుకోవటం మీదే వుంది. నేను, నా అనుచరులతో పొదలమాటున దాగుతూ ఒక్కొక్క అడుగే ముందుకు పోయి, కొద్దిసేపట్లో నరవాహనుడి సైనికుల వెనక భాగాన చేరాను. వాళ్ళను ఒకవైపునుంచి సింహాలు చీకాకుపరుస్తున్నవి; నేను రెండోవైపునుంచి హఠాత్తుగా మీద పడి వాళ్ళను సర్వనాశనం చేయదలిచాను.

నా అభిప్రాయం విన్న నా అనుచరులందరూ నాతో ఏకీభవించారు. కాని, ఒకళ్ళిద్దరికి, నరవాహనుడి సైనికుల మీద పడిన సింహాలు, తమనూ ఎదుర్కొంటవని భయం కలిగింది. చావుకు సిద్ధమయిన తరవాత, అది శత్రువు చేతిలో సిద్ధించినా, సింహంవల్ల తటస్థపడినా - అట్టే భేదం వుండదని వాళ్ళకు నచ్చచెప్పాను.

పొదల మాటున పొంచివున్న నేను ఒక్కమారుగా, 'సమరసేనుడికీ జై!'

అంటూ అరిచి, నరవాహనుడి సైనికులను వెనుకనుంచి ఢీకొన్నాను. ప్రళయ భయంకరంగా అరుస్తూ, నా అనుచరులు ఉగ్రనరసింహుల్లా వాళ్ళ మీద పడ్డారు.

మొట్టమొదటి కత్తి దెబ్బకు, వాళ్ళ నాయకుడి తల బొంగరంలా గాలిలోకి లేచి అంత దూరాన వున్న పొదల్లో పడి పోయింది. నా అనుచరులు తమ కత్తు లతో శత్రుసైనికులను దొరికిన చోట దొరికినట్టు నరకసాగారు. ఈ పోరాటం మధ్య సింహాల గొడవ ఎవరికీ పట్టలేదు. పైగా ఆసరికే రెండు మూడు సింహాలు, నరవాహనుడి సైనికుల యీటెపోటులు తిని వెల్లకిలా పడి గిలగిల కొట్టుకుంటు న్నవి. మిగిలినవి మా భయంకర నాదా లతో హడలెత్తి పారిపోసాగినై.

నాలుగైదు నిమిషాలు గడిచేసరికి, నరవాహనుడి సైనికులలో చాలామంది మా కత్తులకు ఎర అయిపోయారు. తమను ఇంత హఠాత్తుగా ఎదుర్కొన్న వారెవరో వాళ్ళు గ్రహించే లోపలే, వాళ్ళల్లో చాలామందిని తుదముట్టిం చాము. కాని, మిగిలిన పది పన్నెండు మంది అంతలోనే తెప్పరిల్లారు. వాళ్ళల్లో ఒకడు కంఠనాళాలు బద్దలయ్యేలా అరుస్తూ, "శివదత్తుడు, ద్రోహి, నర కండి! అతడి తల ఒక సంస్థానాన్ని తెచ్చి పెడుతుంది!" అంటూ మా మీదికి బెబ్బులిలా ఉరికాడు.

ఆ సైనికుడు ప్రదర్శించిన సాహసం, అతడి అనుచరుల్లో కూడా ధైర్యోత్సాహా లను కలిగించినట్టుంది! వాళ్ళందరూ ఒక్కుమ్మడిగా, నా అనుచరుల మీదకు దూకారు. ఆసరికే విజయం సాధించా మన్న ధీమాలో వున్న, నా అనుచరుల్లో కొందరు, శత్రువుల తాకిడికి నేల కొరి గారు. నేను, నా కత్తితో శత్రుముఖ్యుడి గుర్రాన్ని బలంగా పొడిచాను. ఆ దెబ్బతో అది వెనక రెండు కాళ్ళ మీదా నిలబడే సరికి, రౌతు కింద పడిపోయాడు. గుర్రం సకిలిస్తూ అతడి మీదికి ఒరిగిపోయింది.

—(ఇంకా వుంది)





# న్యాయనిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి, భుజానవేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ నువ్వు ఎవరికోసం ఇంతగా శ్రమపడుతున్నావో, నాకు అర్థం కావడం లేదు. ఇదంతా ఒక సజ్జనుడి కోసమా లేక దుర్జనుడి కోసమా అన్నది అంత ముఖ్యం కాదు. పట్టుదలతో ప్రయత్నించినప్పుడు సజ్జన, దుర్జన భేదం లేకుండా, ఎవరైనా అపూర్వశక్తులను సంపాదించవచ్చు. కాని వాళ్లు ఆ శక్తులను పదిమంది మీదా ప్రయోగించినప్పుడు, అందులోని న్యాయాన్యాయాలను నిర్ణయించడం ఎలా? ఇందుకు ఉదాహరణగా నీకు సాంబుడు, శేషుడు అనే వాళ్ళ కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు




విజయపుర రాజ్యంలోని ఒక చిన్న గ్రామంలో సాంబుడు, శేషుడు అనే మిత్రులుండేవాళ్ళు. వాళ్ళు కూలిపనులు చేసుకుంటూ జీవితం వెళ్ళబుచ్చుతున్నారు. ఆ ఇద్దరిలో సాంబుడు సాత్వికుడు, తెలివైనవాడు. శేషుడు దురుసు స్వభావం కలవాడు, స్వార్థపరుడు

ఒకరోజు శేషుడు, సాంబుడితో, "ఈ ఎదుగు బొదుగు లేని జీవితం భరించడం కష్టంగా వున్నది. మనం గ్రామం వదిలి దేశంలోని అన్ని ప్రాంతాలూ ఒకసారి చుట్టి వద్దాం. ఎక్కడో ఒకచోట మన దారిద్ర్యం తీరిపోయేటంత ధనం సంపాయించే మార్గం దొరక్కపోదు," అన్నాడు.

సాంబుడు మిత్రుడి సలహా ఒప్పుకోక, "ఆశ అన్నివిధాలా అనర్థదాయకం. ఎక్కడైనా మనం కూలీనాలీ పనులు చేసుకుని బతకవలసిన వాళ్ళమే గదా! అలాంటప్పుడు పుట్టి పెరిగిన గ్రామం వదలడం ఎందుకు?" అన్నాడు.

శేషుడికి యీ సలహా రుచించలేదు. వాడు ఆ మర్నాడే గ్రామం వదిలి, కొద్ది రోజుల తరవాత ఒక అరణ్య మార్గాన పోతూ, తపస్సు చేసుకుంటున్న ఒక మునిని చూశాడు.

తపస్సంపన్నులైన మునులు కోరినది యివ్వగలరని శేషుడు విని వున్నాడు. ఆ కారణం వల్ల వాడు ముని దగ్గరకు పోయి, సాష్టాంగపడి లేచి, తన దారిద్ర్య బాధను గురించి చెప్పుకుని, తను గొప్ప ధనవంతుడయ్యే మార్గం చెప్పవలసిందిగా వేడుకున్నాడు.

ముని వాడి మాటలకు చిన్నగా నవ్వి, "నాయనా, కష్టించకుండా ఏదీ ఉట్టినే లభించదు. నువ్వు ఏకాగ్రబుద్ధితో శ్రమలకోర్చగలవాడివైతే, ఒక మంత్రం చెపుతాను. ఆ మంత్రం జపిస్తూ, కొన్నాళ్ళు తపస్సు చేస్తే నీకు లక్ష్మీప్రసన్నం కలుగుతుంది," అన్నాడు.

శేషుడు అందుకు ఒప్పుకున్నాడు. ముని వాడికి మంత్రం ఉపదేశించాడు.

అరణ్యంలో ఒకచోట పెద్ద కొండ ఒకటి వున్నది. శేషుడు దానిమీదికి వెళ్ళి తపస్సు ప్రారంభించాడు. ఆ కొండ మీద కొన్నేళ్ళుగా శృంగి అనే భయంకర భూతం ఒకటి వుంటున్నది. దాని పూర్వ నివాసస్థానం వింధ్యపర్వతాలు. అక్కడ కొక ముని వచ్చి ఘోరమైన తపస్సు మొదలు పెట్టాడు. ఆయన తపశ్శక్తికి భయపడి శృంగి పారిపోయి, యీ కొండ మీదికి వచ్చి చేరింది.

శేషుడు తపస్సు ప్రారంభించగానే శృంగికి బెదురు పుట్టింది. ఎలాగైనా వాణ్ణి అక్కడి నుంచి వెళ్ళగొట్టాలనే ఆలోచనతో అది వాణ్ణి సమీపించి, "నువ్వింత చిన్న వయసులోనే తపస్సు ప్రారంభించావు, కారణం ఏమిటి?" అని అడిగింది.

లక్ష్మిని ప్రసన్నం చేసుకుని ధనం సంపాయించదలచినట్టు శేషుడు భూతానికి చెప్పాడు.

భూతం చిన్నగా చిటికె వేసి, "ఈ మాత్రానికి తపస్సు చేయాలా! నీకు అద్భుతమైన శక్తులు ప్రసాదిస్తాను. వాటి ద్వారా ఎంత ధనమైనా సంపాదించవచ్చు. ఆ తర్వాత మరెన్నడూ యీ పర్వతం చాయలకు రాకు," అన్నది.

శేషుడు అందుకు ఒప్పుకున్నాడు. భూతం క్షణాల మీద అతడికి క్షుద్ర మంత్రాల ద్వారా అద్భుత శక్తులు వశమయ్యేలా చేసింది.





ఇలా క్షుద్ర శక్తులు సంపాదించిన శేషుడు ముందుగా తన గ్రామం చేరి, అందరినీ గ్రామం మధ్య వున్న రావిచెట్టు కింద సమావేశపరిచి, తాను సంపాయించిన అద్భుతశక్తులను గురించి చెప్పాడు.

జనం వాడి మాటలు నమ్మటమా లేదా అని ఆశ్చర్యపోతున్నంతలో ఒక యువకుడు, ''శేషుడూ, పట్టినే దంబాలు పలకకు. నిజంగా ఆ శక్తులుంటే ప్రదర్శించరాదా ?'' అన్నాడు.

శేషుడు కోపంగా, ''నావి దంబాలా ? ఈ క్షణంలోనే నీ నోరు కట్టి వేస్తున్నాను. చాతనైతే ఆ మాట మళ్లీ ఒకసారి పలుకు,'' అన్నాడు.

యువకుడు ఎంత ప్రయత్నించినా నోట మాట రాలేదు. జనం మరింత ఆశ్చర్యపోయి చూస్తున్నంతలో శేషుడు కొద్ది దూరంలో విరగకాసి వున్న మామిడి చెట్టు నొకదాన్ని వాళ్ళకు చూపుతూ, ''క్షణంలో ఆ చెట్టును నిలువునా భస్మం చేస్తాను,'' అంటూ చేయి వూపాడు.

మామిడిచెట్టు భగ్గుమని మండి, కాలి బూడిద అయిపోయింది.

అంతవరకూ జనంలో వుండి ఇదంతా చూస్తున్న సాంబుడు, శేషుడి దగ్గిరకు వచ్చి, ''శేషూ, నువ్వు అద్భుత శక్తులు సంపాయించావనే దాంట్లో మా అందరికీ నమ్మకం కుదిరింది. ఇవాళకిది చాలు. ఇంటికి భోజనానికి వెళదాం రా,'' అని అతణ్ణి తన ఇంటికి తీసుకుపోయాడు.

మాటల సందర్భంలో శేషుడు, సాంబుడికి తాను అద్భుత శక్తుల్ని ఎలా సంపాయించిందీ చెప్పాడు. అంతేకాక, ముందు, ముందు వాటిని ధనసంపాదనకు తానెలా ఉపయోగించుకోబోతున్నదీ వివరించాడు.

సాంబుడు అంతా మౌనంగా విని, శేషుడికి వడ్డించిన అన్నంలో రహస్యంగా విషం కలిపాడు. అది తింటూనే శేషుడు బాధతో విలవిల్లాడుతూ, వీధిలోకి పరిగెత్తి, తనకు సాంబుడు విషం పెట్టాడని

పెద్దగా అరుస్తూ, అక్కడికక్కడే మరణించాడు.

సాంబుడిపై హత్యానేరం మోపబడింది. రాజభటులు అతణ్ణి బంధించి రాజు వసంతసేనుడి దగ్గిరకు తీసుకుపోయారు. వసంతసేనుడు గొప్ప ధర్మపరుడనీ, న్యాయసూక్ష్మాలు తెలిసినవాడనీ ప్రజలు చెప్పుకునేవారు. అటువంటి రాజు నిండు సభలో సాంబుణ్ణి హత్యానేరానికి గాను విచారణ చేసి, కఠినంగా శిక్షించకపోగా, గ్రామ న్యాయాధికారిగా నియమిస్తూ ఉత్తరువులు జారీ చేశాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, వసంతసేనుడి ప్రవర్తన న్యాయవిరుద్ధంగా కనిపించడం లేదా? హంతకులకు ఆ దేశ న్యాయచట్టం ప్రకారం ఉరిశిక్ష విధించాలి. రాజు ఆ పని ఎందుకు చేయలేదు? అటువంటి రాజు సింహాసనార్హుడేనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు చేసినపని స్థూలంగా చూసినప్పుడు న్యాయ విరుద్ధంగా కనబడవచ్చు. కాని, సాంబుడు ప్రజాక్షేమం కోరే, యీ హత్యకు ఒడిగట్టాడని ఆయన గ్రహించాడు. శేషుడు సంపాయించినవి క్షుద్రశక్తులు! వాడు ధనాశాపరుడే కాక, దయాదాక్షిణ్యాలు లేనివాడు. తనకున్న శక్తుల విషయమై సందేహించిన వాడి నోరు పడిపోయేలా చేశాడు. పచ్చని చెట్టును నిలువునా దహించాడు. ఇటువంటి వాడు బతికి వుంటే ప్రజాకంటకుడవుతాడని సాంబుడు అతడికి విషం పెట్టాడు. ఇందులో సాంబుడికి వ్యక్తిగతమైన స్వార్థమంటూ ఏమీలేదు; ప్రజల మేలు కోరే అలా చేశాడు. ఇది అర్థం చేసుకోవడం వల్లనే, రాజు అతణ్ణి ఘనంగా సన్మానించడం జరిగింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# స్వార్థానికి శిక్ష

మాణిక్యపురి రాజ్యంలో మంథరు డనే దళాధిపతి వుండేవాడు. అతడు కాపలా విభాగానికి చెందిన భటులపై అధికారి. అతడి అధ్వర్యంలో కొంతమంది కాపలా భటులూ, వేగులవాళ్ళూ పనిచేస్తూండే వాళ్ళు. రాజ్యంలో దొంగతనాలు, అలజడులు; పొరుగు రాజ్యాలనుంచి దురాక్రమణలు జరగకుండా చూడవలసిన బాధ్యత అతడిది.

మంథరుడు చాలా స్వార్థపరుడు. తన కిందివారిపట్ల బొత్తిగా దయాదాక్షిణ్యాలు లేనివాడు. వాళ్ళు ఉద్యోగ బాధ్యతల్లో ఏమైనా విజయం సాధిస్తే, అది తనదిగా చెప్పుకుని రాజు నుంచి మన్ననా, బహుమతులూ పొందుతూండేవాడు. కాని, తన పొరబాటు, అసమర్థతలవల్ల ఏదైనా కీడు జరిగితే, దాన్ని తనకింది వారిపై రుద్ది, రాజుకు ఫిర్యాదు చేసేవాడు.

ఒకసారి నగర తూర్పు ద్వారం వద్ద కాపలా వుండే భటుడొకడు, శత్రుగూఢచారిని పట్టుకుని దళాధిపతి అయిన మంథరుడికి అప్పగించాడు.

మంథరుడు భటుణ్ణి మెచ్చుకుని పంపివేసి, రాజు దగ్గిరకు పోయి, "మహారాజా, రాత్రి నేను తూర్పు ద్వారంవద్ద మారువేషంలో నగరం ప్రవేశిస్తున్న శత్రుగూఢచారిని పట్టుకున్నాను. మన కాపలా భటులు తమ విధి నిర్వహణలో అంతగా శ్రద్ధ కనబరుస్తున్నట్టులేదు," అన్నాడు.

"ఆ సంగతి తెలుస్తూనే వున్నది! దళాధిపతివైన నువ్వే స్వయంగా శత్రుగూఢచారులను పట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడిందంటే, యిక ఆ కాపలా భటులు ఏం చేస్తున్నట్టు? ఆ సమయంలో అక్కడ కాపలా వున్న భటుణ్ణి ఒక వారం రోజుల పాటు ఉద్యోగంలోనుంచి తొలగించి,

బొమ్మిడి అచ్చారావు

వేతనంలో కోతపెట్టి గట్టిగా హెచ్చరించు,'' అన్నాడు రాజు.

తరవాత ఆయన మంథరుడి ఉద్యోగ నిర్వహణపట్ల సంతృప్తి వెల్లడిస్తూ, నిండు సభలో అతణ్ణి గొప్పగా సన్మానించాడు. శత్రుగూఢచారిని పట్టుకున్న భటుడు యిది చూసి చాలా బాధపడ్డాడు.

మంత్రి రుద్రనాగుడు న్యాయ విచారణలో పేరెన్నికగన్నవాడు. రాజోద్యోగులు గాని, ప్రజలుగాని తమ కష్టసుఖాలు చెప్పుకునేందుకు సరాసరి ఆయన దగ్గిరకు వెళ్లే అవకాశం వుండేది. కాపలా భటుడు ఆయన దగ్గిరకు పోయి తనకు జరిగిన అన్యాయం గురించి వివరంగా చెప్పుకున్నాడు.

మంత్రికి లోగడే మంథరుడి స్వార్థ బుద్ధిని గురించి కొన్ని వార్తలు అందాయి. కాని, తన దగ్గిరకు వచ్చి అతడిపై ఫిర్యాదు చేసేవాళ్లు లేకపోవడంతో చేసేది లేక పూరుకున్నాడు. ఆయన ఖైదులో వున్న శత్రుగూఢచారి వద్దకు తన నౌకరును పంపి, నిజంగా జరిగిందేమిటో తెలుసుకున్నాడు.

ఆయన భటుడితో, ''నువ్వేం విచారించకు. నీకు న్యాయం జరిగేలా చూస్తాను. పోతే, వారం రోజుల తరవాత నువ్వు తిరిగి ఉద్యోగంలో చేరగానే చేయ



వలసింది యిది!'' అంటూ భటుడికి ఒక పథకం వివరించి, పంపేశాడు.

వారం రోజులు గడిచాక భటుడు మరొక శత్రు గూఢచారిని పట్టుకుని దళాధిపతి మంథరుడికి అప్పగించాడు. మంథరుడు చాలా సంతోషించి, భటుడికి వేతనంలో కలిగిన నష్టాన్ని తాను భరించగలనని చెప్పాడు.

రాజు నిండు కొలువులో వుండగా మంథరుడు శత్రుదేశ గూఢచారిని ఆయన దగ్గిరకు తీసుకుపోయి, ''మహారాజా, వారం తిరక్కుండానే మరొక శత్రు గూఢచారి మారువేషంలో మన నగరం ప్రవేశించాలని ప్రయత్నించాడు. కాపలా

భటులు తమ ఉద్యోగ విధుల్ని సక్రమంగా నిర్వర్తించడంలేదు. రాత్రి తూర్పు ద్వారం దగ్గిర కాపలా భటులు ఏపాటి జాగ్రత్తలో వున్నారో తెలుసుకునేందుకు వెళ్ళాను. వాళ్ళు, యీ శత్రుగూఢచారి నగర ద్వారం దాటి లోపలికి రావడం గమనించనేలేదు. ఆ కారణంగా నేనే యితణ్ణి పట్టి బంధించవలసి వచ్చింది," అన్నాడు.

ఆ సమయంలో రాజు దగ్గిరే వున్న మంత్రి రుద్రనాగుడు గూఢచారితో, "శత్రుదేశపు పౌరుడి వేషంలో వుండి, మా నగరంలోని రహస్యాలు తెలుసుకునేందుకు రావడం, ఎంత తెలివితక్కువతనమో, నీకు అర్థమైనట్టులేదు. అందుకే తేలిగ్గా దొరికావు," అన్నాడు.

గూఢచారి చిన్నగా నవ్వి, "మహామంత్రులు క్షమించాలి! నేను శత్రుదేశపువాణ్ణి కాదు, యీ దేశంవాణ్ణే. పొరుగు దేశపువాడి వేషంలో పోయి, గూఢచారి పనులు నిర్వర్తించుకుని తిరిగి వస్తున్నాను. నేనెవరైందీ తూర్పు ద్వారపు కాపలా భటులకు తెలుసు," అన్నాడు.

ఈ మాటలు వింటూనే రాజు, మంథరుడికేసి కోపంగా చూస్తూ, "ఇదంతా ఏమిటి?" అన్నాడు.

మంథరుడు భయంతో వణికిపోతూ తల వంచుకున్నాడు. మంత్రి రుద్రనాగుడు అతడితో, "లోగడ శత్రు గూఢచారిని స్వయంగా పట్టుకున్నానంటూ అబద్ధాలు చెప్పి, రాజుగారి నుంచి బహుమతులు తీసుకున్నావు. కాని, అతణ్ణి పట్టుకున్నది కాపలా భటుడు. నీ స్వార్థంకొద్దీ అతడి మీద లేనిపోని నేరారోపణలు చేశావు కూడా. నీ అవినీతిని బయటపెట్టేందుకే, యీ పథకం వేయవలసివచ్చింది," అన్నాడు.

మంథరుడు వంచిన తల ఎత్తలేదు. రాజు అప్పటికప్పుడే అతణ్ణి పదవినుంచి తొలగించి, శత్రుగూఢచారిని పట్టుకున్న తూర్పు ద్వారం కాపలా భటుణ్ణి దళాధిపతిగా నియమించాడు.



# రోగి చికిత్స

విజయనగరానికి దూరదేశం నుంచి ఒక వైద్యుడు వచ్చి, నగరంలో అంతగా వైద్యులు లేని ఒక ప్రాంతాన వైద్యశాల తెరిచాడు. ఈ విషయం ఆయన చుట్టుపక్కలవున్న ఇళ్ళవాళ్ళను కలుసుకుని చెప్పి వచ్చాడు.

వారం రోజులు గడిచినై. ఒక్క రోగీ ఆయన దగ్గిరకు రాలేదు. ఎందుకిలా జరిగిందని ఆయన ఆశ్చర్యపోతూ, ఒక రోజున వైద్యశాల వాకిట్లో నిలబడ్డాడు. ఆ సమయంలో రకరకాల వ్యాధులతో బాధపడేవాళ్ళు కొందరు వైద్యశాల ముందుకు వచ్చి, అలా ఒక క్షణం తేరిపార జూసి, వెనక్కు తిరిగిపోసాగారు.

వైద్యుడు వాళ్ళల్లో ఒకణ్ణి ఆపి, "వైద్యశాలదాకా వచ్చి కూడా, ఎందుకలా తిరిగి పోతున్నారు?" అని అడిగాడు.

రోగి, వైద్యశాలముందున్న పూలకుండీలను చూపుతూ, "ఆ కుండీల్లోని పూలమొక్కలు నీళ్ళు లేక వాడిపోతున్నవి. డబ్బుపోసి కొనితెచ్చిన పూలమొక్కల్నే కాపాడడంచేతగాని వాడివి, యిక రోగుల్ని ఏం కాపాడగలవు అన్న అనుమానం, మాక్కలిగింది," అన్నాడు.

రోగి చికిత్స, వైద్యుడికి వెంటనే గుణం యిచ్చింది! ఆయన అప్పటికప్పుడే పూల కుండీల్లో నీళ్ళు పోసి, మొక్కలను శ్రద్ధగా సాకసాగాడు. అలా రెండు వారాలు గడిచేసరికి, పూలమొక్కలు కళకళలాడినై. రోగులు కూడా ఒక్కరొక్కరే వైద్యశాలకు రాసాగారు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి






# సామాన్యుడి ఆతిథ్యం

సిద్ధనాధు డనే సన్యాసి, తన శిష్య బృందంతో దేశసంచారం చేస్తూ, శివపురం గ్రామం సమీపించేసరికి బాగా పొద్దు పోయింది. ఇంతలో వున్నట్టుండి పెద్ద ఉరుములూ, మెరుపులతో వాన కూడా ప్రారంభమైంది. సన్యాసీ, శిష్యులూ హడావిడిగా సమీపంలో వున్న ఊరి సత్రంలోకి పరిగెత్తారు.

శివపురం సంపన్నగ్రామమని సిద్ధనాధు డికి తెలుసు. పదేళ్ళక్రితం ఒకసారి దక్షిణదేశయాత్ర చేస్తూ, అతడా గ్రామంలో ఒకనాడు ఘనంగా అతిథి మర్యాదలు పొందాడు. అందువల్ల, ఎంత పొద్దుపోయినా తనకూ, శిష్యులకూ భోజనం ఏర్పాట్లు జరగగలవన్న నమ్మ కంతో, ఇద్దరు శిష్యులను తన రాక గురించి చెప్పేందుకు గ్రామంలోకి పంపాడు.

అప్పటికే ఒక జామురాత్రి గడిచి పోవడం వల్లా, విపరీతమైన గాలి తోడుగా పెద్ద వర్షం పడుతుండడం వల్లా, అంత మందికి భోజనం పెట్టడానికి గ్రామస్థుల్లో ఎవరూ ముందుకు రాలేదు.

శిష్యులు తిరిగి వచ్చి, సంగతి చెప్ప గానే సిద్ధనాధుడు కోపంగా, "ఈ గ్రామం పాపిష్ఠిదైపోయిందన్నమాట! ఈ రాత్రికి మనం పస్తులుండక తప్పేలాగలేదు," అన్నాడు.

ఆ సమయంలో, వానలో తడిసి నీళ్ళోడుతున్న దుస్తులతో ఒక వ్యక్తి సత్రంలోకి వచ్చి, సిద్ధనాధుడి మాటలు విని, అతడికి వంగి నమస్కరించి, తన పేరు రామయ్య అని చెప్పుకుని, "స్వామీ, నేను పక్క గ్రామం వెళ్ళి వస్తూ వానలో తడిసి, కాసేపు తలదాచుకుందామని యిక్కడికి రావడం మేలే అయింది.

జొన్నలగడ్డ రత్న

నేను, యీ గ్రామం వాణ్ణే," అని ఏదో చెప్పబోయాడు.

సిద్ధనాథుడు విసుగ్గా అతడి మాటలకు అడ్డు వచ్చి, "ఏం, ఊరయ్యా యిది! సాధుసజ్జనులను ఆదరించడం, మీరెప్పటికి నేర్చుకునేట్టు," అన్నాడు.

"స్వామీ, నేనొక సామాన్య కుటుంబీకుణ్ణి. సాధారణంగా తమబోటి మహాత్ములు ఊళ్లోకి వస్తే, వారికి వసతీ, భోజనాల ఏర్పాట్లు చూడడానికి గ్రామ పెద్దలంతా ఒకరి మీద ఒకరు పోటీపడి, నాబోటి సామాన్యుల్ని, ఆ చాయలకే రానివ్వరు. బహుశా, యింత పెద్ద వర్షం రావడం, నా అదృష్టకారణం అయుండాలి! ఇప్పుడే ఇంటికి పోయి తమ భోజనం ఏర్పాట్లు చేయిస్తాను," అన్నాడు రామయ్య.

సిద్ధనాథుడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

రాత్రి రెండోజాము ముగుస్తుండగా, భోజనాలు తయారయినట్టు సిద్ధనాధుడికి కబురు వచ్చింది. ఆయన వెంటనే శిష్యులతో వెళ్ళి, చిన్న పూరి ఇంట్లో అతి సామాన్యంగా వున్న భోజనం ఏర్పాట్లు చూసి రుసరుసలాడుతూ, "ఈ భాగ్యానికా, యింత ఆలస్యం చేశారు? ముందు వడ్డన ప్రారంభించమని చెప్పు; అందరూ



ఆకలితో నకనకలాడిపోతున్నారు," అన్నాడు రామయ్యతో.

రామయ్య వినయంగా, "వర్షం మూలాన వస్తువులన్నీ సమకూర్చుకుని వంట ముగించేసరికి, యీ వేళ అయింది. మన్నించాలి," అన్నాడు.

రామయ్య ఇంట్లోవాళ్ళు వడ్డన ప్రారంభించారు.

శిష్యులలో ఒకడు, "ఇది పప్పేనా? ఇందులో ఉప్పుగల్లు పడినట్టే లేదు," అన్నాడు కోపంగా.

అంతలో ఇంకొక శిష్యుడు, "ఈ కూరలో చిటికెడు కారం పొడి వేసినట్టు కూడా లేదు," అన్నాడు చిరాకుపడుతూ

మరొక శిష్యుడు ఏవగించుకుంటు న్నట్టు ముఖం పెట్టి, "పాయసాన్ని యింత కారుచప్పగా తయారు చేయ వచ్చని, నాకు యివ్వాళే అర్థమైంది!" అన్నాడు హేళనగా.

ఇలా ప్రతిదానికీ ఏదో ఒక వంక పెడుతూ శిష్యులూ, సన్యాసీ భోజనం ముగించారు. వాళ్ళు తిరిగి సత్రానికి వెళ్ళబోతున్న సమయంలో రామయ్య, సన్యాసితో, "స్వామీ, నన్నూ, మా ఇంటి వాళ్ళనూ క్షమించాలి. మామూలు గృహస్థుల్లా కాకుండా, సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులు ఆకలిదప్పుల్ని ఏకొంచెంగానైనా నిగ్రహించుకోగలరన్న అజ్ఞానంతో, మావాళ్ళు వంట ఆలశ్యం చేశారు. అంతేగాక, సన్యాసులకు రుచుల విషయంలో పట్టింపు వుండదన్న భ్రమలో కూడా మేమందరం పడిపోయాం," అన్నాడు.

సిద్ధనాధుడు ఆ మాటలకు జవాబేమీ చెప్పకుండా వెళ్ళిపోయాడు.

నాలుగు నెలల తరవాత ఆయన దక్షిణ దేశయాత్రలు ముగించుకుని శిష్యులతో తిరిగివస్తూ, శివపురం సత్రంలో దిగి, శిష్యులతో రామయ్యకు భోజనం ఏర్పాట్లు చెయ్యమని కబురు చేశాడు.

రామయ్య సిద్ధనాధుడి దగ్గిరకు వచ్చి, "స్వామీ, ఆ మధ్య కలిగిన అనుభవంతో, తమవంటి గొప్పవారిని సత్కరించగల స్థోమతు వున్నవాణ్ణి కాదని గ్రహించాను," అన్నాడు.

సిద్ధనాధుడు చిరునవ్వు నవ్వి, "రామయ్యా, నేనూ ఆ మధ్య కలిగిన అనుభవం వల్ల ఒక గొప్ప సత్యాన్ని గ్రహించాను. గృహస్థుల నుంచి సన్యాసులు స్వీకరించే ఆతిధ్యాలు పెళ్ళి భోజనాల స్థాయిలో వుండరాదన్నదే, ఆ సత్యం!" అన్నాడు.

రామయ్య సిద్ధనాధుడిలో వచ్చిన మార్పుకు చాలా సంతోషించి, ఆ రోజు ఆయనకూ, అతడి శిష్యులకూ తన ఇంట ఆతిథ్యం యిచ్చాడు.






బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఒక పల్లెటూరి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. అతని పేరు సోమదత్తుడు. అతని తండ్రి అతి బీదవాడు. తనకున్న కుంట పొలమూ సేద్యం చేసుకుని ఎలాగో జీవించే వాడు.

సోమదత్తుడు పెరిగి పెద్దవాడై, తన తండ్రి కుటుంబ పోషణ కోసం పడే శ్రమ కళ్లారా చూసి ఎంతో విచారించాడు. తన తల్లిదండ్రులను సుఖపెట్టడానికి అతనికి ఒకటే మార్గం కనిపించింది. అదేమంటే, తాను ఎక్కడనైనా విద్య నేర్చుకుని కొలువులో ప్రవేశించటం. తాను కూడా తండ్రితో పాటు కష్టపడవచ్చు, కాని ఉన్న పొలం కొద్ది గనక ఫలితం ఉండదు. అందుకని సోమదత్తుడు తండ్రితో, "నేను తక్షశిలానగరం వెళ్ళి ఏదైనా విద్య నేర్చుకుంటాను," అన్నాడు. తండ్రి అందుకు సమ్మతించాడు.

సోమదత్తుడు తక్షశిల వెళ్లి, ఒక గురువు వద్ద శుశ్రూష చేసి, విద్య నేర్చుకుని తిరిగి స్వగ్రామానికి వచ్చాడు. తన తండ్రి ఎప్పటిలాగే తనకు గల రెండు ఎద్దులతో ఆ కుంటపొలమే సాగుచేస్తూ, ఉదయం లగాయతు అస్తమయం దాకా శరీరశ్రమ చేస్తున్నాడు. ఇది చూసి సోమదత్తుడు, ఇక ఒక్క క్షణం కూడా ఉపేక్షించరాదనుకుని, మర్నాడే బయలుదేరి కాశీనగరం వెళ్ళి అక్కడ రాజు దగ్గిర కొలువులో ప్రవేశించాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే సోమదత్తుడి తండ్రివద్ద ఉన్న రెండు ఎద్దులలో ఒకటి మరణించింది. ఎన్నో ఏళ్ళుగా తనను పోషిస్తూ, తన చేత పోషించబడుతూ ఉండిన ఎద్దు పోయే

సరికి సోమదత్తుడి తండ్రికి ఒక చెయ్యి పడిపోయినట్టయింది. తన కొడుకు ప్రయోజకుడై రాజుగారి వద్ద కొలువు చేస్తున్నాడుగదా, రాజుతో చెప్పి ఒక్క ఎద్దును ఇప్పించ లేకపోతాడా అనే ఉద్దేశంతో, సోమదత్తుడి తండ్రి కాశీనగరానికి వెళ్ళి తన కొడుకును కలుసుకున్నాడు.

జరిగినదంతా విని సోమదత్తుడు తండ్రితో, "అమ్మా, నువ్వూ పెద్దవాళ్లయిపోయారు. ఆ కాస్త భూమికోసం ఎందుకు తాపత్రయ పడతారు? మీరు కూడా వచ్చేసి నా వెంట వుండండి. ఏదో విధంగా జరిగిపోతుంది," అన్నాడు.

దానికి తండ్రి సుతరామూ ఒప్పుకోక, "నేను ఆ గడ్డమీదనే పోవాలి. అది వదిలిపెట్టి రానే రాను. ఇంకొక ఎద్దును ఇప్పించావంటే మడి దున్నుకుంటూ హాయిగా కాలక్షేపం చేస్తాను. నాకు అక్కడ ఉండే శాంతి ఇక్కడ ఉండదు," అన్నాడు.

సోమదత్తుడు కొలువులో చేరి కొద్ది రోజులే అయి వుండటం చేత అతని వద్ద ఎద్దును కొనడానికి తగినడబ్బు లేదు. రాజును యాచించటం భావ్యంగా వుండదు. నిన్నగాక మొన్ననే వచ్చి అప్పుడే చెయ్యి చాస్తున్నాడని రాజుగారు అనుకోగలరు. అందుచేత అతను తండ్రితో, "నేను రాజును ఎద్దుకోసం యాచిస్తే,నీకు ఎద్దుతో ఏంపని? ఎవరికోసం అడుగుతున్నావు? అని ప్రశ్నలు వేస్తారు.



అదీగాక కొలువు చేసేవారు యాచించటం ధర్మం కాదు. నీకీ బాధలేవీ లేవు. ఉన్న సంగతి అంతా చెప్పి, ఒక ఎద్దును దయ చేయించమని అడుగు. రాజు తప్పక ఇస్తాడు,'' అన్నాడు.

దీనికి తండ్రి ఒప్పలేదు. ''నాయనా, నేను పల్లెటూరి వాణ్ణి. నాకు నాగలి పట్టటం తప్ప మరేమీ తెలీదు. ఎక్కడ రాజుగారు, ఎక్కడ దర్బారు, ఎక్కడ నేను! నాకా సభలోకి అడుగు పెడితే నోటమాట కూడా రాదేమో. రాజుగారితో ఎట్లా మాట్లాడాలో, ఆ మర్యాద లేమిటో నాకేమైనా తెలుస్తాయా? వద్దు, వద్దు! ఎట్లాగో నువ్వే నాకు పని సానుకూలం చేసిపెట్టు,'' అన్నాడాయన కొడుకుతో.

''అదంతా ఇబ్బంది కాకుండా నేను ఒక పని చేస్తాను. ఒక శ్లోకం రాసి ఇస్తాను. దాన్ని రెండుమూడు రోజులు వల్లెవేసి రాజుగారి దగ్గరికి వెళ్లి చదువు. నీ పని సానుకూల మవుతుంది,'' అని సోమదత్తుడు తండ్రికి ధైర్యం చెప్పాడు. తరవాత అతను ఆ శ్లోకం రాసి తండ్రి చేత వల్లె వేయించాడు.

''ద్వే మేం గోణా, మహారాజ,
యేహి ఖేత్తం కసామసే;
తేసు ఏకో మతోదేవ,
దుతియం దేహి ఖత్తియ.''

దీని భావమేమంటే, ''మహరాజా, నాకు రెండు ఎద్దుండేవి. వాటితో సేద్యం చేసుకునేవాణ్ణి. దేవా, వాటిలో ఒకటి



చచ్చిపోయింది. ఓ రాజా, రెండో ఎద్దును ఇప్పించండి,'' అని.

ముసలివాడు చాలా శ్రమపడి యీ శ్లోకాన్ని కంఠస్థం చేసుకున్నాడు. తరవాత సోమదత్తుడు తన తండ్రిని తనతో బాటు దర్బారుకు తీసుకువెళ్లాడు. కొడుకు చెప్పిన విధంగా ఆయన రాజుకూ, మంత్రులకూ నమస్కారాలు చేసి, చేతులు కట్టుకుని వినయంగా నిలబడ్డాడు.

''ఎవరు మీరు? ఏం కావాలి?'' అని రాజు అడిగాడు. వెంటనే ముసలివాడు లోగడ వల్లె వేసిన శ్లోకం చదివాడు. కాని కంగారులో శ్లోకం కొద్దిగా మారిపోయి ఈ విధంగా తయారయింది.

''ద్వే మేం గోణా, మహారాజ,
యేహి ఖేత్తం కసామసే;
తేసు ఏకో మతోదేవ,
దుతియం గణ్హ ఖత్తియ.''

సభికులంతా నవ్వారు. సోమదత్తుడు తల వంచుకున్నాడు. ఎందుచేతనంటే అతని తండ్రి కంగారులో, ''నాకు రెండో యెద్దును ఇప్పించండి,'' అనటానికి, ''నా రెండో ఎద్దును తీసుకోండి!'' అనేశాడు.

రాజు వృద్ధుడితో, ''నీ ఎద్దును నాకివ్వటానికేనా ఇంటి నుంచి బయలుదేరి ఇంత దూరం వచ్చావు?'' అన్నాడు నవ్వుతూ.

''మహారాజా, కావలిస్తే మీరు దాన్ని తీసుకోండి. దానిమూలానే యింత గొడవ వచ్చింది,'' అంటూ జరిగినదంతా రాజుకు సోమదత్తుడి తండ్రి విన్నవించుకున్నాడు.

సోమదత్తుడి నీతివర్తనకు రాజు చాలా సంతోషించాడు. తన కొలువులో వున్న వాళ్ళంతా రాజును చీటికీ మాటికీ ఆశ్రయించి, అదీయిదీ కావాలని కోరేవారే, సోమదత్తుడు అలా చేయలేదు. రాజు ఎనిమిది జతల యెడ్లను చక్కగా అలంకరింప చేసి, సోమదత్తుడి తండ్రికి దానం ఇచ్చేశాడు.






# సుల్తానా రజియా – 2

ఢిల్లీ పాలనాధికారాన్ని చేబట్టిన సుల్తానా రజియా ధైర్యసాహసాలూ, న్యాయాన్యాయ విచక్షణా గలది. తన వ్యక్తిగత ప్రవర్తన గురించి యితరు లేమనుకుంటున్నారన్న సంగతి పట్టించుకునేది కాదు. పురుషుడిలా వస్త్రధారణ చేసేది. గుర్రపు స్వారి అంటే ఆమెకు చాలా మక్కువ.

ఒకసారి ఆమె గుర్రపు స్వారి చేస్తూ, ప్రమాదవశాన కింద పడనున్న తరుణంలో, యాఖూత్ అనే అబిసీనియా అశ్విక దళాధిపతి ఆమెను కాపాడాడు. రజియాకు అతడి పట్ల అభిమానం కలిగింది. యాఖూత్ మంచి తెలివి తేటలు గలవాడు.







రజియాకు యాఖూత్‌పై కలిగిన అభిమానం, క్రమంగా వారిద్దరి మధ్యా గాఢస్నేహంగా మారింది. వాళ్ళిద్దరూ రాజప్రాసాదంలో, ఉద్యాన వనంలో తరచుగా కలుసుకుంటూండే వాళ్ళు. ఇది, దర్బారులోని యితర సర్దారులకు కోపకారణం అయింది.



రజియా దర్బారులోని సర్దారుల్లో తురుష్క జాతివాళ్ళు ఎక్కువ పలుకుబడిగల వాళ్ళు; బలవంతులు, వాళ్ళు అబిసీనియా వాడైన యాఖూత్‌ను ద్వేషించ సాగారు. రజియాను సింహాసనం నుంచి దింపి, తమ చేతిలో కీలుబొమ్మకాగల మరొకడికి దాన్ని కట్టబెట్టదలిచారు.

సర్దారుల కుట్ర సంగతి తెలుసుకున్న రజియా చెలికత్తెలు, ఆమెకా సంగతి చెప్పారు. కాని, రజియా వాళ్ళతో, తానేమీ నేరం చెయ్యలేదనీ, ఆ కారణం వల్ల కుట్రదారులను చూసి భయపడవలసిన అవసరం లేదనీ అన్నది.





ఆమె కుట్రదారులను పిలిపించి, “ఢిల్లీ పాలకురాలుగా, నా బాధ్యత నాకు క్షుణ్ణంగా తెలుసు. నేనెవరితో స్నేహంగా వుండాలో, ఎవరిని విరోధించాలో శాసించే హక్కు మీకు లేదు,” అన్నది. కాని, ద్వేషంతో నిలువునా మండిపోతున్న సర్దారులకు రజియా మాటల్లోని సత్యం రుచించలేదు.




ఒకనాడు తురుష్క సర్దారులు హఠాత్తుగా యాఖూత్ ఇంటిని చుట్టుముట్టారు. యాఖూత్ కత్తిదూసి ఆత్మరక్షణకు ప్రయత్నించే లోపలే కుట్రదారులు అతణ్ణి చంపారు. ఈ విధంగా రజియా అభిమాన పాత్రుడైన నిర్దోషి యువకుడు యాఖూత్ తుదముట్టించబడ్డాడు.

ఆ తరవాత కుట్రదారులు రజియాను ఖైదుచేశారు. ఆమె ఢిల్లీని మూడున్నర సంవత్సరాల కాలం పరిపాలించింది. తురుష్క సర్దారులు ఆమెను కోటలోని ఒక గదిలో బంధించి, తురుష్క సైనికులను కాపలా పెట్టారు.







రజియా ఖైదునుంచి, తురుష్క సర్దారుల నాయకుడైన అల్టూమియాకు ఒక లేఖ రాసింది. అల్టూమియా ఆమెను రహస్యంగా సందర్శించాడు. సుల్తానా రజియా అద్భుత సౌందర్యానికి సమ్మోహితుడైన అల్టూమియా, ఆమె రక్షణకు తన ప్రాణాలనైనా ఒడ్డుతానన్నాడు.

అల్లూమియా ఒక చిన్న సైనికదళాన్ని సమకూర్చుకుని, రజియా ఖైదు చేయ బడిన కోటను ముట్టడించి, కాపలా సైని కులను పారదోలాడు. అతణ్ణి రజియా వివాహమాడింది. ఈ లోపల రజియా సవతి తమ్ముడొకడు ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు.







అల్లూమియా ఏ విధంగానైనా సరే రజియాను తిరిగి ఢిల్లీ సింహాసనం మీద కూర్చోబెట్ట దలిచాడు. అతడూ, రజియా కొంత సైన్యంతో ఢిల్లీమీద దాడికి బయలుదేరారు. ఈ సంగతి తెలిసిన తురుష్క సర్దారులు, వాళ్ళను ప్రతిఘ టించేందుకు సైన్యాన్ని సమాయత్త పరిచారు.

తరవాత కొద్దిరోజులకు ఇరుపక్షాల మధ్య యుద్ధం జరిగింది. రజియా, అల్లూమి యాలు యుద్ధంలో ఎనలేని ధైర్య సాహసాలు ప్రదర్శించారు గాని, ప్రబలు లైన శత్రువులకే జయం చేకూరింది. వాళ్ళు రజియా, అల్లూమియాలను ఖైదీ లుగా పట్టుకుని హత్యచేశారు. ఈ విధంగా ప్రపంచ చరిత్రలో ప్రసిద్ధులైన బహు కొద్దిమంది పరిపాలకురాండ్రలో ఒకతె అయిన సుల్తానా రజియా జీవితం ముగిసింది.



# ఎలా వచ్చింది ధైర్యం?

గంగాపురంలో నలుగురు స్నేహితులుండేవాళ్ళు. వాళ్ళలో రంగడు అనేవాడికి చీకటిపడిం తరవాత ఎక్కడికి వెళ్ళాలన్నా మహచెడ్డ భయం. తోడుగా ఎవరైనా లేందే వాడు గడప దాటేవాడుకాదు.

ఒక రోజున వాణ్ణి స్నేహితులు ఆట పట్టిస్తూ, "నీ అంత పిరికివాణ్ణి, మేం మరొకణ్ణి ఎరగం. ఎవరైనా నీ ధైర్యం ఏపాటో తెలుసుకునేందుకు పందెం వేశారనుకో, అప్పుడు నీ పిరికితనం కాస్తా బయట పడిపోతుంది," అన్నారు.

"వట్టి పందేలంటే, నాకు గిట్టవు. ఎవరైనా డబ్బు పందెం వేస్తే, నా ధైర్యం చూపెడతాను," అన్నాడు రంగడు ధీమాగా.

"అలాగా! అయితే వంద రూపాయిల పందెం. ఇవాళ రాత్రి నువ్వు శ్మశానంలోకి వెళ్ళి రాగలిగితే వంద రూపాయిలిస్తాం. అలా చెయ్యలేకపోతే నువ్వు, మాకు వంద రూపాయి లివ్వాలి," అన్నారు స్నేహితులు.

రంగడు అందుకు ఒప్పుకుని, అర్ధరాత్రివేళ శ్మశానంలోకి వెళ్ళి తిరిగివచ్చి, స్నేహితుల్ని వంద రూపాయిలు యివ్వమన్నాడు.

స్నేహితులు వాడికి అలాగే యిస్తామని చెప్పి, "చీకటిపడితే ఒంటరిగా గడపదాటని వాడివి, శ్మశానంలోకి ఎలా వెళ్ళిరాగలిగావు?" అని అడిగారు.

"ఇది కాస్తా కూస్తా—వంద రూపాయిల పందెం! నేను నిజంగా శ్మశానంలోకి వెళ్ళి వచ్చానో లేదో తెలుసుకునేందుకు, మీ ముగ్గురూ కొంచెం వెనగ్గా నా వెంట వస్తారని, నాకు తెలుసు," అన్నాడు రంగడు.

—బైసాని రవి





# ఇద్దరు కవులు

రామశాస్త్రి గొప్పకవి. ఆయన తన కవిత్వంతో ఎందరినో మెప్పించి, గొప్ప గొప్ప బహుమానాలందుకున్నాడు. ఆకారణంగా ఆయనలో ఎక్కడలేని గర్వం పేరుకుపోయింది.

గోవిందశాస్త్రి కూడా మంచి కవే. కాని, పరిస్థితులు అనుకూలించనందువల్ల, ఆయనకు రామశాస్త్రి కొచ్చినంత పేరు రాలేదు. ఇద్దరిదీ ఒకే ఊరు.

''నీ కవిత్వంలో లోపాలున్నాయి. వాటిని సరిదిద్దుకోగలిగితే, నువ్వు కూడా నాలాగా పైకి రాగలవు,'' అంటూండేవాడు రామశాస్త్రి, గోవిందశాస్త్రితో.

గోవిందశాస్త్రికి యీ మాటలు నచ్చేవికాదు. కాలం కలిసిరాక తన కవిత్వానికి పేరు రావడంలేదనీ, కవిగా రామశాస్త్రికి తానేమాత్రం తీసిపోననీ, ఆయన అభిప్రాయం.

ఒకసారి విష్ణుపురం జమీందారు దసరా వేడుకల సందర్భంలో చిన్న కవి సమ్మేళనం ఏర్పాటు చేయదలిచాడు. ఆ సమ్మేళనానికి ఆయన రామశాస్త్రిని అధిపత్యం వహించమని కోరాడు.

ఈ సంగతి విన్న అనేకమంది చిన్నా చితుకు కవులు, జమీందారు నుంచి బహుమతులు పొందాలన్న ఆశతో, రామశాస్త్రిని ఆశ్రయించారు. కాని, గోవిందశాస్త్రి మాత్రం తనకేమీ పట్టనట్టు వూరుకున్నాడు. అడగకపోయినా, రామశాస్త్రి తనను తప్పకుండా యీ సమ్మేళనానికి ఆహ్వానిస్తాడని, ఆయన నమ్మకం.

కాని, రామశాస్త్రి, గోవిందశాస్త్రిని ఆహ్వానించలేదు. తనను ఆశ్రయించినవాళ్ళనే ఆయన సమ్మేళనానికి పిలిచాడు. ఇది, గోవిందశాస్త్రికి, రామశాస్త్రిపట్ల విపరీతమైన కోపానికి కారణం అయింది.

రాంబాబు

రామశాస్త్రి కవిసమ్మేళనం పూర్తయాక తిరిగివచ్చి, గోవిందశాస్త్రిని కలుసుకుని, అక్కడ జరిగిన విశేషాలు చిలవలూ, పలవలూ అల్లి చెప్పాడు.

విష్ణుపురం జమీందారు చాలామంది కవులకు చిన్న చిన్న బహుమానాలిచ్చాడట. కాని, తనకు మాత్రం ఘనంగా వెయ్యి వరహాలివ్వడమేగాక, తన కవిత్వాన్ని మెచ్చుకుంటూ సభలో చాలా సేపు మాట్లాడాడట.

"ఇది, నా కవి జీవితంలో మరుపురాని సంఘటన! ఏ మహాకవి మాత్రం యింతకన్న గొప్పగా కోరుకునేందుకేముంటుంది?" అన్నాడు రామశాస్త్రి పరవశించిపోతూ.

అసలే కోపంలో వున్న గోవిందశాస్త్రికి యీ మాటలు మరింత కోపాన్ని తెప్పించినై. అయినా, ఆయన అది బయట పడనీయకుండా ఎంతో శాంతంగా, "నువ్వు ఎప్పుడైనా అమరపురి జమీందారును కలుసుకున్నావా?" అని అడిగాడు.

"లేదు. ఏమిటి విశేషం ఆయనలో?" అని అడిగాడు రామశాస్త్రి.

"ఆయన కవిత్వంలోని బాగోగుల్ని త్రాసులో పెట్టి మరీ తూస్తాడని చెబుతారు. ఆయన యీనాటివరకూ కవిత్వం విని ఆనందించి, ఆయా కవుల్ని సన్మానించాడేగాని, నోరు విప్పి ఏ ఒక్కర్నీ పొగడలేదు. నీ కవిత్వం విని, ఆయన ఒక్కగా ఒక్క ప్రశంసావాక్యం పలికినా,



ఉన్న ఊరివాడివైనా నిన్ను మహాకవిగా ఒప్పుకుంటాను,'' అన్నాడు గోవిందశాస్త్రి.

రామశాస్త్రి కోపం తెచ్చుకుని దురుసుగా, ''నువ్వేదో పందెం అన్న ధోరణిలో మాట్లాడుతున్నావు, అవునా ?'' అన్నాడు.

''పందెం మాట ఎత్తావుగనక, పందెమే! అమరపురి జమీందారు నీ కవిత్వం విని, శ్లాఘిస్తూ ఒక్కమాట పలికినా, నేను నీకు వెయ్యి వరహాలిస్తాను. అలా కానప్పుడు నువ్వు, నాకు వెయ్యి వరహాలిచ్చుకోవాలి, సరేనా ?'' అన్నాడు గోవిందశాస్త్రి.

''జీవితంలో యీనాటివరకూ ఓటమి అనేది ఎరగను. రేపు ఉదయానే బయలుదేరి అమరపురి వెళ్తాను,'' అన్నాడు రామశాస్త్రి కోపంగా.

''అలాగే వెళ్ళిరా. యిదీ నీ జీవితంలో మరపురాని మరొక సంఘటన కావచ్చు,'' అన్నాడు గోవిందశాస్త్రి.

రెండు రోజుల తరవాత రామశాస్త్రి, గోవిందశాస్త్రిని కలుసుకుని, ''నేను వెయ్యి వరహాలూ గెలుచుకున్నట్టే. అమరపురి జమీందారు నా కవిత్వాన్ని మెచ్చుకుంటూ స్వదస్తూరీతో రాసి యిచ్చిన యోగ్యతాపత్రం యిదుగో!'' అంటూ గోవిందశాస్త్రికి ఒక కాయితం యిచ్చాడు.

గోవిందశాస్త్రి నవ్వుతూ, ''ఇది ఆయన స్వదస్తూరీ కాదని నేనడంలేదు. మన పందెం ఏమిటంటే—జమీందారు నోరు విప్పి, నీ కవిత్వాన్ని మెచ్చుకోవడం. అలా జరగలేదుకదా ? నువ్వు ఓడావు ; వెయ్యి వరహాల మాటేమిటి ?'' అన్నాడు.

రామశాస్త్రి దిగులుగా ముఖం పెట్టి, ''ఆ జమీందారు మూగవాడని ముందుగా తెలిసివుంటే, నీతో యీ పందెం వేసేవాణ్ణే కాదు. సరే, చేసేదేముంది, ఆ పందెం డబ్బేదో రేపు తెచ్చి యిచ్చుకుంటాను,'' అన్నాడు.

''చూశావా, నెలతిరక్కుండానే నువ్వు జీవితంలో మరవలేని రెండు సంఘటనలు చవిచూశావు!'' అన్నాడు గోవిందశాస్త్రి వచ్చే నవ్వు ఆపుకుంటూ.





# మర్రిదయ్యం-నుయ్యిదయ్యం

అత్తవారింటికి వెళ్ళిన కూతురు, వారం రోజులైనా జరక్కుండానే తిరిగిరావడం చూసి, అనసూయమ్మ ఆశ్చర్యపోతూ, "అదేమిటే, రాధా! ముందు కబురైనా చెయ్యకుండా, యిలా వేళ కాని వేళ హఠాత్తుగా తిరిగొచ్చావు?" అని అడిగింది.

రాధ బాడుగ బండిలోంచి దిగుతూనే, "నాకు వెంటనే వెయ్యి రూపాయిలు కావాలి. కొత్త పందిరిమంచం, కుర్చీలూ బల్లలూ కొని – ఆ రుక్మిణి అసూయతో కుమిలిపోయేలా చేయాలి!" అన్నది రుసరుసలాడుతూ.

అనసూయమ్మకు నెత్తిన పిడుగు పడినట్టయింది. అంతకు వారం కిందటే అల్లుడూ కూతురూ పండగకు వచ్చి, విలువైన కొత్త బట్టలూ అవీ పట్టుకు పోయారు. మళ్ళీ యిప్పుడు వెయ్యి రూపాయిలు కావాలంటే, ఎక్కణ్ణించి తెచ్చేట్టు!

ఆమె పైకి తన ఆదుర్దా, చిరాకూ కనబడనివ్వకుండా, "ముందు నువ్వు భోజనం చెయ్యి. తరవాత తీరిగ్గా అన్ని సంగతులూ మాట్లాడుకుందాం," అన్నది.

రాధ యింత హడావిడిగా పట్నంనుంచి తిరిగివచ్చి, తల్లిని వెయ్యి రూపాయలివ్వమని అడగడానికి ఒక ముఖ్య కారణం వున్నది. ఆమె వుంటున్న వీధికంతకూ, గొప్ప అందగత్తె అని నలుగురమ్మలక్కలూ చెప్పుకునేవారు. అంతేగాక, ఆమె ఇంట ఎన్నో విలువైన సామాను లున్నవనీ, ఇంటిని చక్కగా తీర్చిదిద్దుకుంటుందనీ మెచ్చుకునేవారు.

అయితే, రాధ పుట్టింటినుంచి వెళ్ళేసరికి, పక్క వాటాలో రుక్మిణి అనే అమ్మాయి భర్తతో వచ్చి కాపరం పెట్టింది.

మాచిరాజు కామేశ్వరరావు



ఈ అమ్మాయి పచ్చటిపసిమిలాంటి శరీర చ్ఛాయతో, నల్లని పొడవాటి జడ తో చూడముచ్చటగా వుండేది. పైగా, ఆమె వెంట తెచ్చిన పందిరిమంచం, ఇతర సామానులూ, అన్నీ సరికొత్తవి. వీధి అమ్మలక్కలందరూ రాధ ఎదటే, రుక్మిణిని ఆకాశానికెత్తేశారు. వాళ్ళ మాటల ధోరణి చూస్తే, రుక్మిణి అందం ముందు రాధ అందం, సూర్యుడి ఎదట దివిటీ అన్నట్టున్నది.

రాధకు, రుక్మిణి మీద ఎక్కడలేని అసూయ కలిగింది. రుక్మిణి ఒకటి, రెండుసార్లు పలకరించినా, అయిష్టంగా ముఖం తిప్పేసుకున్నది. భర్తను మనం కూడా కొత్త పందిరిమంచం, కుర్చీలూ కొందామని అడిగితే, అతను కోపంగా వున్నవి చాల్లే అనేశాడు. ఆ జవాబుకు ఒళ్ళు మండి ఆమె డబ్బుకోసం పుట్టింటికి వచ్చింది.

అనసూయమ్మ కూతురుకు వడ్డన చేస్తూ, ఆమెను మాటల ధోరణిలో పెట్టి, సంగతి గ్రహించి, "పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్టు, ఆ రుక్మిణితో నీకు పోటీ ఎందుకు?" అన్నది.

"నేనేం నక్కను కాదులే! ఇన్ని మాటలెందుకు, నా మొహాన వెయ్యి రూపాయిలు పారేస్తే, నా దారిన నేను పోతాను," అన్నది మొండిగా రాధ.

"మన పెరట్లో వున్నది బాదంచెట్టు; అదేదో డబ్బులు కాసే చెట్టనుకుంటు న్నావో ఏమో! నా దగ్గిర చిల్లిగవ్వలేదు. మీ నాన్న ఊళ్లో లేడు; ఉన్నా అడగ్గానే వెయ్యి రూపాయిలు కుమ్మరించగల తాహతు ఆయనకు లేదు," అన్నది అనసూయమ్మ కోపంగా.

రాధ చరచరమంటూ లేచి, చెయ్యి కడుక్కొని అప్పటికప్పుడే ప్రయాణం కట్టింది.

"సూర్యాస్తమయానికి అట్టే కాలం లేదు. నువ్వు వెళ్ళవలసింది అడవిదారి. పట్నం చేరేసరికి అర్ధరాత్రవుతుంది. పొద్దున్నే వెళుదువుగాని," అని

అనసూయమ్మ కూతురును ఎంతగానో బతిమాలింది.

అయినా, రాధ తల్లి మాట వినక అప్పటికప్పుడే బాడుగ బండి కుదుర్చుకుని బయలుదేరింది. బండి చీకటి పడే వేళ అడవిమార్గం చేరి కొంత దూరం వెళ్ళాక, రాధ భయంగా దిక్కులు చూస్తూ, "ఈ ప్రాంతాల ఎక్కడో పాడుపడిన నుయ్యీ, ఊడలమర్రి చెట్టూ వుండాలి. అక్కడ దయ్యాలు పగలే కీచులాడుకుంటవని చెపుతారు. గుర్రాన్ని కాస్త గట్టిగా అదిలించు," అన్నది బండివాడితో.

"అమ్మా, ఆ దయ్యాలు మనబోటి మంచివాళ్ళ జోలికి రావు. ధనాశా, అసూయా, పిసినారితనం వున్నవాళ్ళంటే వాటికి అలుసు. మీరలా కళ్ళు మూసుకుని చిన్న కునుకు తీయండి. మీరు కళ్ళు తెరిచేసరికి బండి పట్నంలో మీ యింటి ముందుంటుంది." అన్నాడు బండివాడు.

రాధ బండిలో ఒక పక్కగా చేరగిలబడి కళ్ళు మూసుకున్నది. కొద్దిసేపటి తరవాత పెద్ద కుదుపుతో బండి ఆగిపోయింది. ఆమె ఉలిక్కిపడుతూ లేచి చూడగా, బక్కచిక్కిపోయి వున్న గుర్రం నురుగులు కక్కుతూ కిందపడి వున్నది.

బండివాడు గుర్రంకేసి పరీక్షగా చూస్తూ, "దీనికేదో పెద్ద రోగమే వచ్చింది.





ఎలాగూ పట్నం దగ్గిరకొచ్చాంగనక, మీరు కష్టం అనుకోక కాస్త నడిచి వెళ్ళండి. నేను, యీ పక్కనవున్న గూడేనికి పోయి పశువుల వైద్యుణ్ణి తీసుకువస్తాను,'' అన్నాడు దిగులుగా.

రాధ భయపడుతూనే బయలుదేరింది. ఆమె కొద్ది దూరం వెళ్ళేసరికి, ఒక పెద్ద ఊడలమర్రీ, దానికింద నుయ్యీ కంట బడినై. మర్రికొమ్మ మీద ఒక దయ్యం వున్నది ; నూతి గట్టుపైన మరొక దయ్యం వున్నది. రెండూ పెద్దగా వాదించు కుంటున్నాయి.

''నేను ఎత్తుమీద వుంటాను. కిలకిల మంటూ పక్షులు పైనే ఎగురుతాయి ; చల్లని గాలులు కూడా పైనే వీస్తాయి. అందువల్ల, నేనే గొప్పదాన్ని !'' అంటున్నది మర్రిదయ్యం.

''నేను నేలను అంటిపెట్టుకుని వుంటాను. మహావృక్షాలకైనా నేలే ఆధారం. వాటికి ప్రాణం పోసే నీరు పారేది కూడా నేలమీదే. అందువల్ల, నేనే గొప్పదాన్ని!'' అంటున్నది నుయ్యి దయ్యం.

''కాలం తీరినవాళ్లు పైకి రావలసిందే !'' అన్నది మర్రి దయ్యం.

''అదేం మాట ! వాళ్ళు నేలపాలవుతారు,'' అన్నది నుయ్యి దయ్యం.

అంతలో బిక్కు బిక్కుమంటూ ఆ ప్రదేశాన్ని దాటిపో చూస్తున్న రాధ, వాటి కంటబడింది.

''అదిగో, ఎవరో ఆడకూతురు ! తగువులాటల్లో వాళ్ళకు అనుభవం జాస్తి. మనలో ఎవరు గొప్పో, ఆవిణ్ణే తేల్చి చెప్పమని అడుగుదాం,'' అనుకుని, రెండు దయ్యాలూ, రాధను గట్టిగా కేక వేసి పిలిచాయి.

పారిపోయే మార్గం లేదు కనక, ఏమైతే అదవుతుందన్న తెగింపుతో రాధ వాటిని సమీపించింది.

దయ్యాలు తమ తగువు గురించి ఆమెకు చెప్పి, ''మాలో ఎవరు గొప్ప?'' అని అడిగాయి.

రాధకు అవి హానిచేసే దయ్యాల్లా కనబడకపోవడంతో, చప్పున ఒక ఆలోచన వచ్చింది. ఆమె గట్టిగా ఒకసారి గొంతు సవరించుకుని, "గొప్పతనం ఉన్న స్థలాన్నిబట్టి కాక, శక్తిసామర్థ్యాలనుబట్టి వుంటుంది. మర్రిదయ్యం చెట్టు కొమ్మల్ని వూపి, ఎన్ని బంగారు నాణాలు రాల్చగలదో, నుయ్యిదయ్యం చేదవేస్తే, ఎన్ని బంగారునాణాలను పైకి పంపగలదో దాన్ని బట్టి ఎవరు గొప్పో నిర్ణయిస్తాను," అన్నది.



మర్రిదయ్యం చెట్టుకొమ్మలు ఊపింది. గలగలమంటూ బంగారు నాణాలు రాలాయి. నూతి దయ్యం రాధ వేసిన చేద నిండుగా బంగారు నాణాలు పైకి పంపింది. ఆమె వాటిని తన దగ్గిరున్న సంచీలో వేసుకున్నది.

"బంగారు నాణాల విషయంలో, మీరిద్దరూ సమ ఉజ్జీలు. అందువల్ల మరొక పరీక్ష పెడతాను. మా ఇంటి పక్కన ఒక భార్యాభర్తలున్నారు. భర్త, భార్యను పురుగును చూసినట్టు చూస్తాడు. ఆమె పచ్చగా వుంటుంది, నల్లటి పొడవాటి జడ. మీకు తెలుసో లేదో, మగవాళ్ళకు నల్లని శరీరం, తెల్లటి జుట్టూ అంటే చాలా యిష్టం. కనక మీలో ఒకరు ఆమె ఒంటిరంగు నల్లగానూ, మరొకరు జుట్టును తెల్లగానూ మార్చండి. దాన్నిబట్టి మీ గొప్పలు నిర్ణయిస్తాను. ఆమె భర్త కూడా భార్యను యిష్టంగా చూసుకుంటాడు," అన్నది రాధ.

రుక్మిణి కురూపి అయితే చూసి సంతోషిద్దామనుకున్నది రాధ.

దయ్యాలు రెండూ ఆ పని చిటికెలో చెయ్యగలమన్నవి. కాని రాధ అక్కణ్ణించి వెళ్ళిపోగానే వాటికి ఒక అనుమానం వచ్చింది. ఆమె తన పక్క ఇంటావిడ అన్నదిగాని, ఏ పక్కయింటి ఆవిడో సరిగా చెప్పలేదు. అందువల్ల తమతో అంత మంచిగా మాట్లాడిన రాధ పైనే తమ శక్తిని ప్రదర్శిద్దామనీ, భర్త

ఆమెను మరింత బాగా చూసుకుంటాడనీ, అనుకున్నవి.

అర్ధరాత్రివేళ ఎవరో తలుపు తట్టిన శబ్దమై, రాధ భర్త లేచివచ్చి, తలుపు తెరుస్తూనే, ఆమెను చూసి భయంతో కేక పెట్టాడు.

"ఎందుకలా భయపడిపోతారు ? నేను రాధను !" అన్నది రాధ.

"నువ్వు రాధవా లేక దయ్యానివా ? కారునలుపు ముఖం, తెల్లటి జుట్టూ —" అంటూ రాధ భర్త తలుపు మూయ బోయాడు.

రుక్మిణికి బదులు దయ్యాలు రెండూ తనను కురూపిని చేశాయని గ్రహించిన రాధ, కెవ్వుమంటూ పెద్దగా అరిచి, కింద పడిపోయింది.

"ఎందుకమ్మగారూ, కేక పెట్టారు ? పీడకలా ?" అంటూ ఎవరో భుజం తట్టే సరికి రాధ కళ్ళు తెరిచింది.

ఇప్పుడు బాడుగ బండి అడవి దారి దాటి, పట్టణాన్ని సమీపిస్తున్నది. తనను భుజం తట్టి లేపిన బండివాడు, తనకేసి ఆశ్చర్యంగా చూడడం గమనించిన రాధ, యీ జరిగినదంతా ఒక పీడకల అని తెలుసుకున్నది. ఇంత బాధాకరమైన పీడకలకు కారణం, రుక్మిణిపై తనకున్న అర్థంలేని అసూయ !

ఆమె ఇల్లు చేరుతూనే పక్క వాటా లోకి వెళ్ళి, రుక్మిణిని ఆప్యాయంగా పలక రిస్తూ, "ఇన్నాళ్ళూ చెప్పలేదుగాని, నువ్వు చాలా అందంగా వుంటావు, అక్కా! నాకు అక్కలు లేరు. నీ వల్ల ఆ లోటు తీరినట్టుగా వున్నది." అన్నది.

లోగడ తను కంటబడగానే ముఖం పక్కకు తిప్పుకునే రాధ, తనను ఎంతో ఆప్యాయంగా అక్కా అంటూ పిలిచి నందుకు చాలా సంతోషించిన రుక్మిణి, "నీకు అక్కలు లేని లోటు నా వల్ల తీరితే, నాకు చెల్లెళ్ళు లేని లోటు నీవల్ల తీరుతుంది. కొద్దిసేపట్లో వంటపని ముగించుకుని, మీ యింటికి వస్తాను, చెల్లీ !" అన్నది.





# గుణవతి

పూర్వం కాంచీపురంలో శక్తిసారు డనే వైశ్య యువకుడొకడు వుండేవాడు. తండ్రి తాతలనుంచీ వస్తున్న వర్తక వ్యాపారాల్లో అతను లక్షల కొద్దీ ధనం సంపాదించాడు. ఇరవయ్యోయేట అతనికి పెళ్ళాడా లనిపించింది.

భార్య గుణాలే గృహస్థుకు ప్రియాన్నీ, హితాన్నీ చేకూర్చుతాయి అని అతను పెద్దల ద్వారా విని ఉన్నవాడు కావటం చేత సద్గుణవతి అయిన భార్యనే పెళ్లాడ నిశ్చయించుకున్నాడు. అందుచేత తనకు తగిన కన్యను తానే వెతుక్కునే ఉద్దేశంతో అతను దేశాల మీద బయలు దేరాడు.

శక్తిసారుడికి సాముద్రికం తెలుసును. సాముద్రికం చెప్పే మిష మీద అతను ఎంతోమంది కన్యల చేతులు చూశాడు. మంచి లక్షణాలుగల పిల్లగా కనిపించిన కన్యలకు అతను ఒక చిన్న పరీక్ష పెట్టేవాడు.

అతను ఈ ప్రయాణంలో తనవెంట రెండు శేర్ల వడ్లు తీసుకువెళ్లాడు. ఆ వడ్లను తనకు నచ్చినట్టు కనబడిన పిల్ల కిచ్చి, "అమ్మాయీ, యీ వడ్లతో నాకీ పూట భోజనం వండి పెడతావా?" అని అడిగేవాడు. ఈ మాట విని కొందరు అతన్ని చూసి వెర్రివాడన్నట్టుగా నవ్వారు. మరికొందరు ఆశ్చర్యపడి, "అది ఎలా సాధ్యమవుతుంది?" అన్నారు. కాని ఒక్కరు కూడా ఆ పని చేయలేక పోయారు.

ఇలా కన్యలను చూసుకుంటూ వెళ్ళగా వెళ్ళగా అతనికి ఒకనాడు కావేరీ తీరాన ఒక కుటీరంలో గుణవతి అనే ఒక పిల్లా ఆమెను సాకుతున్న ఒక వృద్ధురాలూ కనిపించారు. వారు నిరుపేదలు.

శక్తిసారుడు గుణవతి చెయ్యి చూసి, ఆమెలో మంచి లక్షణాలుండటం గమనించి, "అమ్మాయీ, నా దగ్గిర వడ్లున్నాయి. వాటితో నాకీ పూట భోజనం వండిపెడతావా?" అని అందరినీ అడిగినట్టే ఆమెను కూడా అడిగాడు.

గుణవతి ఈ మాట విని నవ్వనూ లేదు, ఆశ్చర్యపడనూలేదు. ఆమె అతను కోరినట్టుగా ఆ వడ్లతో భోజనం చేసి పెట్టటానికి ఒప్పుకున్నది.

ఆమె వడ్లు తీసుకుని తడిపి ఆరబెట్టి, దంచి చెరిగి ఊక తీసింది. ఆ ఊకను అవ్వకిచ్చి, "దీన్ని బంగారు పనివాళ్ళకు అమ్మి ఆ డబ్బులతో ఆటే పచ్చివీ, ఆటే ఎండువీ కాని కట్టెలూ, ఉసిరిపప్పూ పట్టుకురా," అన్నది.

అవ్వ అలాగే చేసింది. గుణవతి బియ్యం కడిగి, పొయి వెలిగించి ఎసరు పెట్టింది. బియ్యం చిమడగానే వార్చి గంజి తీసి, అందులో కొంచెం ఉప్పువేసి, ఉసిరిపప్పు నూరి ముద్దచేసి శక్తిసారుడికిస్తూ, "ఈ ముద్ద నోట్లో వేసుకుని ఈ గంజి తాగండి. తరవాత కాస్సేపు విశ్రాంతి తీసుకుని స్నానంచేసి వచ్చారంటే భోజనం పెడతాను," అన్నది.

అన్నం కాగానే గుణవతి కొన్ని కట్టెలు ఆర్పి బొగ్గులు తీసి వాటిని అవ్వకిచ్చి, "వీటిని కూడా ఎవరికైనా ఇచ్చి, కాస్త ఆకుకూరా, మజ్జిగా పట్టుకురా!" అన్నది.

అవ్వ తెచ్చిన ఆకుకూర వండి, భోజనాలవేళ దాటకుండానే గుణవతి అతిథిని స్నానం చేసి రమ్మన్నది.

శక్తిసారుడు స్నానం చేసి వచ్చి కూరా, మజ్జిగతో సహా కడుపునిండా భోజనం చేశాడు. అతనికి గుణవతి పొదుపూ, యుక్తీ చూసి చాలా సంతోషమయింది. ఆమెకు తన అసలు వృత్తాంతం చెప్పేసి తనను పెళ్లాడవలసిందిగా కోరాడు. గుణవతి ఒప్పుకున్నది. అతను ఆమెను తన ఊరికి తీసుకుపోయి పెళ్ళి చేసుకుని చాలా కాలం సుఖంగా జీవించాడు.






# విఘ్నేశ్వరుడు

శత్రుంజయుడు ఎలుకతో చళుకవర్మను దూరంగా చిన్న ఇంటికి తరిమి, "నువ్వు, మా మధ్య ఉండవలసినవాడివి కావు. నీ ఎలుక వాహనుడైన విఘ్నేశ్వర భక్తికి తగ్గట్టు, ఆ వాహనం జాతిదే నీకు తగ్గ ఇల్లాలు! నీ ఇల్లాలు అసూర్యం పశ్యగా ఎవరికీ కనపడకుండా ఉండే అంతఃపుర కాంతగా ఉండడానికి ఇంటినిండా ఎలుక బిలాలు ఉన్నవిలే!" అంటూ ఎకసక్కెం చేశాడు.

చళుకుడు తండ్రి మాటలకు ప్రశాంతంగా, "తండ్రి, కుమారులందరికీ పెళ్ళి చేయడమనేది చాలా గొప్ప విషయం! ఎవరికెవ్వరో అది ఏనాడో రాసి పెట్టిందే అంటారు. మన చేతుల్లో ఏమీ లేదు! అంతా ఆ విఘ్నేశ్వరుని ఇచ్ఛకదా!" అన్నాడు.

చళుకుడు ఉత్తమ గ్రంథాలను చదువుతున్నప్పుడు చుళుక పక్కనే చేరి వింటూండేది. చళుకుడు విఘ్నేశ్వరుణ్ణి అర్చిస్తూన్నప్పుడు నోటితో పువ్వులు అందించేది. చళుకుడు తిన్న తర్వాత పెడితేనే తినేది. అలా కాలం గడుస్తూండగా వినాయకచవితి దగ్గిరికి వచ్చింది.

అందరూ ఇళ్ళకు వెల్లవేసి ధాన్యాలు దంచుకొంటున్నారు. చుళుక రాత్రికిరాత్రి ఎలుకలన్నిటినీ పిలిచింది. ఎలుకలు తోకలు ముంచి ఇంటి గోడలకు సున్నం కొట్టాయి, పళ్ళతో పైపొట్టు వొలిచి ధాన్యాన్ని మెరికల్లా బియ్యం చేశాయి.



తలను అక్కడున్న రాతికేసి కొట్టుకుంటుండగా విఘ్నేశ్వరుడు అక్కడ ప్రత్యక్షమై, ఎలుకను చేతితో ముద్దుగా నిమిరాడు. శాపవిమోచనమై ఎలుకరూపు మాయమై దేవకాంత కళ్యాణకింకిణి నిజరూపంతో విఘ్నేశ్వరుడి పాదాల మీద ప్రణమిల్లి, అనేకవిధాల స్తుతించింది. విఘ్నేశ్వరుడు కళ్యాణకింకిణిని ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు.

కళ్యాణకింకిణి నీళ్ళ బిందెను తలకెత్తుకొని నడిచి వెళ్తూంటే, దారిపొడవునా ప్రజలు బొమ్మల్లాగ నిల్చుని చూస్తూ, "ఎవరీ దేవసుందరి? ఎవరింటికి వెళ్తున్నది?" అని విస్తుపోయారు.

చళుకవర్మ వదినలు కళ్యాణకింకిణి తమ చిన్న మరది ఇంటిలోకి వెళ్ళడం చూసి, ముఖాలు వేలాడదీసుకున్నారు.

శత్రుంజయుడు తన అజ్ఞానానికి తనే సిగ్గుపడి, చళుకవర్మను సతీసమేతంగా రాజమందిరానికి తోడ్కొని వచ్చాడు.

చళుకుని అన్నలు తండ్రితో, "మాకూ అలాంటి ఎలుకలతోనే ఎందుకు పెళ్ళిళ్ళు చేయలేదు? అలా చేసి ఉంటే మాకూ అప్సరసలే తయారై వచ్చి ఉండేవారు కదా!" అని గద్దించి అడిగారు.

ఇటువంటి తెలివిమాలిన కొడుకుల కోసమా నేను సామ్రాజ్యాన్ని ఆర్జించి

వినాయకచవితి ఉదయాన చళుకుని వదినలు స్వయంగా బంగారు బిందెలతో నదీజలాన్ని నెత్తినెత్తుకొని వస్తున్నారు. అది చూచి చళుకుడు కొద్ది విచారం కనబరిచాడు.

చుళుక వెంటనే బిందెలో దూరి దొర్లించుకుంటూ నదీతీరాన్ని చేరుకుని యివతలకి వచ్చి కొండంత బిందెనూ, పొంగిపొర్లి ప్రవహిస్తున్న నదినీ చూసి హతాశురాలై, "బిందెనైతే దొర్లించుకొచ్చాను గాని, నీళ్ళెలా ముంచగలను? బిందెతో ఎలా మోసుకెళ్ళగలను? అవివేకురాల్ని, పనికిమాలినదాన్ని, నేనెందుకు బ్రతికి?" అని అనుకుంటూ

పెట్టింది! అని శత్రుంజయుడు విరక్తి చెంది తపస్సు చేసుకోడానికి అరణ్యాలకు పోయాడు.

చళుకవర్మ అన్నలు అసంతృప్తి, పరస్పరద్వేషాలతో కలహించి యుద్ధాలు చేసి కొట్టుకుచచ్చారు. ఎంత వద్దంటున్నా వినక, ప్రజలు చళుకవర్మను తమ రాజుగా ప్రకటించుకున్నారు. చళుకవర్మ పాలనలో ప్రజలు సుఖశాంతులతో జీవించారు.




చళుకవర్మ కళ్యాణకింకిణి పేరున కళ్యాణి అనే మరొక గొప్ప నగరాన్ని నిర్మించాడు. అతనికి కళ్యాణకింకిణి వలన నలుగురు పుత్రులు కలిగారు. వారు చాళుక్యులుగా పిలువబడ్డారు. ఆ విధంగా చాళుక్యరాజవంశాలకు మూల పురుషుడైన చళుకవర్మ కాలంలో వాతాపి నగరం అనేక దేవాలయాలతో, ప్రాకారాలతో శోభిల్లింది. కళలకు కాణాచిగా, విద్వాంసులకు పండితులకు ఆటపట్టుగా, భూతలస్వర్గం అనిపించుకుంది. నగరాధిదేవతగా విఘ్నేశ్వరుడు ఆరాధింపబడ్డాడు. ఉత్కృష్టశిల్పానికి ప్రామాణికమైన ఆలయమంటపశిల్పాన్ని చూడ్డానికి దేశం నలుమూలల నుంచీ రాజులు మొదలుకొని సామాన్యయాత్రికుల వరకూ ఎల్లప్పుడూ వస్తూండేవారు.

చాళుక్యులు నాలుగు దిక్కులా రాజ్యాలు ఏర్పరుచుకొని పాలించారు. చాళుక్య వంశరాజులు శాఖోపశాఖలుగా దేశమంతటా వ్యాపించి రాజ్యాలు చేశారు. వాతాపినేలినవారు వాతాపిచాళుక్యులనీ, కళ్యాణినగరాన్ని పాలించినవారు కళ్యాణి చాళుక్యులనీ, వేంగినేలినవారు వేంగి చాళుక్యులనీ, తూర్పుచాళుక్యులు, పశ్చిమ చాళుక్యులు, సౌరాష్ట్రచాళుక్యులుగా పేరొందారు. కాలక్రమాన వాతాపిని బాదామి అని కూడా వ్యవహరించారు.

### విఘ్నేశ్వర వినోద గాథలు

వాతాపి గణపతిగా విఘ్నేశ్వరుడూ, విఘ్నేశ్వర క్షేత్రంగా వాతాపి నగరమూ



దేశాంతరాల్లో పేరు మ్రోగుతున్న కాలంలో, పావనమిశ్రుడు అనే పండితుడు సాయంకాలాల్లో వాతాపి గణపతి ఆలయ మంటపంలో పిల్లలకు విఘ్నేశ్వరుడికి సంబంధించిన కథలను చెపుతూండేవాడు.

మంటపం గోడలపై విఘ్నేశ్వరుడి గాథలు చిత్రాలుగా చిత్రితమై ఉన్నాయి. ఆ చిత్తరువుల్లో వినోదకరమైన ఒక చిత్రాన్ని ఒక పిల్లవాడు గురువుకు చూపించి ఆ కథ చెప్పమన్నాడు.

పావనమిశ్రుడు కథ ప్రారంభించాడు:

ఒక నగరంలో సత్యశర్మ, లోభగుప్త ఇరుగు పొరుగున ఉండేవారు. లోభగుప్తుడి అసలు పేరు లాభగుప్త. కాని అతని లోభితనానికీ, అత్యాశకూ ఊళ్ళో వారంతా లోభగుప్త అనే స్థిరపరిచారు.

సత్యశర్మ, లోభగుప్త రోజూ శివాలయానికి వెళ్ళేవారు. సత్యశర్మ గర్భగుడిలోకి వెళ్లే దారిలోనే ఉన్న విఘ్నేశ్వర విగ్రహం ముందు ప్రణమిల్లి స్తోత్రగానం చేశాక శివదర్శనం చేసుకొని వెళ్లేవాడు.

లోభగుప్తుడు గర్భాలయం ప్రవేశిస్తూనే శివలింగం ముందు సాగిలపడి కోటి లాభాలు చేకూర్చమని చాలా సేపు అలాగే ధ్యానిస్తూండేవాడు.

ఒకనాడు సత్యశర్మ శివదర్శనం చేసుకొని వెళ్తూండగా, లోభగుప్తుడు వస్తూన్న సమయంలో నంది విఘ్నేశ్వరుడితో, "విఘ్నేశ్వరా! నీ భక్తుడు సత్యశర్మ చాలా డబ్బు అవసరంలో ఉన్నాడు. అతణ్ణి ఆదుకోవలసిన అవసరం లేదా?" అన్నాడు.

"ఔనోయి, నందీ! ఈ సాయంకాలానికి అతనికి వెయ్యి వరహాలు అందిస్తున్నాను!" అని విఘ్నేశ్వరుడు అన్నాడు.

రాతి విగ్రహాలు మాట్లాడుకుంటున్న మాటలు ఆశ్చర్యంతో లోభగుప్తుడు విని, క్షణం ఆలస్యం చేయకుండా సత్యశర్మ ఇంటికి వెళ్లి, "శర్మా! నువ్వేదో అవస

రంలో ఉన్నట్టుంది. ఐదువందల వర హాలు ఇస్తాను. తీసుకో!'' అని చెప్పి వెళ్ళి డబ్బు తీసుకొచ్చాడు.

సత్యశర్మ, ''అయ్యా గుప్తగారూ! నిన్ననే కదా అసలు వడ్డీలతో మీరిచ్చిన రుణం తీర్చకపోతే ఇల్లు ఖాళీ చేయమని చెప్పారు. ఈ అయిదువందలూ ఎలాగ తీర్చగలను?'' అన్నాడు.

లోభగుప్తుడు, ''అదా నీ సందేహం! ఈ ఐదు వందలు తీసుకుని సాయంకాలానికి నీకు లభించిన మొత్తం ఎంతయితే అంత నాకు యిస్తే చాలు!'' అన్నాడు.



సత్యశర్మ తటపటాయిస్తూంటే, అతని భార్య. ''ముందు ఆ ద్రవ్యాన్ని తీసుకోండి, అవతల పెళ్ళివారు చాలా సేపై కూర్చుని ఉన్నారు!'' అని ప్రోత్స హించింది.

సత్యశర్మ కుమార్తెకు అప్పుడే పెళ్ళి కుదిరింది. వరుడి తల్లీ తండ్రీ అయిదు వందల వరహాల విలువ చేసే నగలు పిల్లదానికి పెట్టాలని పట్టుబట్టారు.

సత్యశర్మ లోభగుప్తుడితో, ''అయ్యా, సాయంకాలానికి నాకు లభించింది ఇవ్వడానికి నా కెలాంటి అభ్యంతరమూ లేదు కాని. అలా లభించే ఆస్కారం ఏదీ లేదు....'' అంటూ నసుగుతూంటే, లోభగుప్తుడు, ''అదంతా వదిలెయ్యి, మనం ఇరుగు పొరుగు వాళ్ళం! ఇప్పుడు నేనిస్తే తర్వాత నువ్విస్తావు. యీ మాత్రం దానికి మొహమాట పడకు!'' అంటూ ఐదు వందల వరహాల మూట సత్యశర్మ చేత పెట్టాడు.

సత్యశర్మ సత్యసంధుడని లోభగుప్తుడికి బాగా తెలుసు.

సాయంత్రం ఔతున్నది కాని సత్య శర్మకు ఏ వరహాలూ అందిన సూచన కనిపించలేదు. లోభగుప్తుడు కంగారు పడుతూ దేవాలయానికి పరుగెత్తి, విఘ్నేశ్వర విగ్రహం తొండం పట్టుకొని లాగుతూ, ''ఏమయ్యా, విఘ్నేశ్వరా!



"అదా సంగతి! ఐదువందలు ఇచ్చి వెయ్యి పుచ్చుకొని సునాయాసంగా అయిదువందల వరహాలు కాజేద్దామని ఎత్తువేశావన్నమాట! ఆశాపాతకుడా, నీ దురాశకు ప్రాయశ్చిత్తంగా సత్యశర్మకు మిగతా ఐదువందలూ యివ్వడమే గాకుండా, అతడి కిచ్చిన రుణాన్ని చెల్లు పెట్టి, అతని కుమార్తె వివాహం నీ స్వంత ఇంటి పెళ్ళి లాగ జరిపించు!" అని విఘ్నేశ్వర విగ్రహం నుండి గంభీరగర్జన వినిపించింది.

సత్యశర్మకు వెయ్యి వరహాలు త్వరగా ఇప్పించుమరి....," అని అంటూండగా అతని అరచేయి తొండం సందున ఇరుక్కుపోయి తీస్తే రాకుండా తొండం మరింత గట్టిగా బిగించి నొక్కిపట్టింది.

నొప్పితో లోభగుప్తుడు కిరకిరలాడిపోతూంటే, "సత్యశర్మకు వెయ్యి వరహాలు ఎంత త్వరగా నువ్వు ఇప్పిస్తే అంత త్వరగా నీకు విడుదల!" అని విగ్రహం నుండి వినిపించింది.

లోభగుప్తుడు రెండో చేత్తో నెత్తీ నోరూ బాదుకుంటూ, "అన్యాయం దేవుడా, అన్యాయం! ఐదువందలు ముందే ఇస్తిని గదా!" అని పెడబొబ్బలు పెట్టాడు.

లోభగుప్తుడు క్షణాల మీద తన వారిని పిలిపించి, సత్యశర్మకు మిగతా ఐదు వందల వరహాలూ ఇప్పించి, అతని రుణానికి చెల్లు పెట్టించి, అతని కూతురు పెళ్లి ఖర్చంతా పెట్టుకుంటానని ప్రమాణం చేశాకనే అతని చేయి ఇవతలికి వచ్చింది.

లోభికి మంచి శాస్తి జరిగిందని ఊరు ఊరంతా చెప్పుకున్నారు.

లోభగుప్తుడు సత్యశర్మ కుమార్తె వివాహాన్ని స్వంత కూతురు వివాహం లాగ వైభవంగా జరిపించాడు. అప్పట్నించి బుద్ధి తెచ్చుకొని లోభగుణాన్ని విసర్జించి, అన్యాయంగా ఆర్జించిన ఆస్తిని ధర్మకార్యాలకు వినియోగించి, విఘ్నేశ్వరుడి దయకు పాత్రుడై, గొప్ప ధార్మికుడని పించుకున్నాడు.

కథ ముగించి పావనమిశ్రుడు విఘ్నేశ్వర ప్రసాదాన్ని తెచ్చి పిల్లలకు పంచాడు. పిల్లలు ప్రసాదాన్ని నోట్లో వేసుకొని ఆనందంగా కేరింతాలు కొడుతూ ఇళ్ళకు పరుగెత్తారు.

మరొక సాయంత్రం ఒక బాలిక మంటపం గోడలపై గల మరో చిత్రాన్ని చూపించి కథ చెప్పమన్నది. పావన మిశ్రుడు ప్రారంభించాడు:

కళ్యాణినగరంలో కలహకంఠి అనే ధనికురాలు, కోడలు పుట్టింటినుంచి ఎక్కువగా నగలు పెట్టుకురాలేదని సాధింపుతో రాచిరంపాన పెట్టిపెట్టి, చివరకు నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టింది.

కలకంఠి అని నామకరణం చేయబడినప్పటికీ కలహకంఠిగా పేరు పొందిన ఆ ధనిక అత్త కోడలు సాదామిని, పుట్టెడు దుఃఖంతో పుట్టింటికి బయలుదేరి దారి తప్పి అరణ్యంలోపడి, ఆకలితో అటమటించిపోతూ ఒక వెలగచెట్టు దగ్గర పడిపోయింది.

తను పుట్టినింటి కెళ్ళి కూడా ప్రయోజనం లేదు. తన పెళ్ళికి చేయించిన నగలకే తండ్రి అప్పులపాలయ్యాడు. మరి నగలు పెట్టలేడు. అంచేత ఆ కీకారణ్యంలో చావడమే మేలు! అనుకుంటూండగా చెట్టు నుండి ఒక వెలగపండు రాలి దొర్లుకుంటూ, అందుకోమన్నట్లు ఆమె చేతి దగ్గిర ఆగిపోయింది. దాన్ని పట్టుకొని సాదామిని లేచి కూర్చుంటుండగా భూమి అదిరేలాగ ఒక పెద్ద ఏనుగు పరుగున రావడం కనిపించింది.

సాదామిని చిన్నతనం నుంచీ విఘ్నేశ్వరుడిపై గొప్ప భక్తి విశ్వాసాలు కలది. విఘ్నేశ్వరుణ్ణి తలచుకొని ఏనుగు పాదాల కిందపడి చావాలని ఎదురు వెళ్ళింది. ఏనుగు ఠక్కున ఆగిపోయింది.

ఏనుగు సాదామిని చేతిలో ఉన్న వెలగపండును తొండంతో తీసుకొని నోట వేసుకొని, దీవిస్తున్నట్లుగా తొండంతో సాదామిని తలనిమిరి చేయి పట్టుకొని తిన్నగా ఒక పెద్ద గుహ దగ్గిరికి తీసుకెళ్ళింది.





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 9

యోధకన్యల అధికారి అయిన ముసలి దాని మాటలు విని, హసన్ భోరున ఏడవ సాగాడు. అతని దుఃఖం చూసి కలవర పడి ఆమె, "నన్నేం చెయ్యమంటావో చెప్పు. నిన్ను ఈ దీవి మీదికి రానిచ్చి నందుకే నా పీక తెగిపోతుంది. పోనీ నీకు భార్య కాకపోతే అంతులేని ధనం ఇస్తాను పట్టుకు పో. దానితో బతికున్నంత కాలమూ చక్రవర్తిలాగా భోగాలు అనుభవించు," అన్నది.

హసన్ ఆమె కాళ్ళు పట్టుకుని, "నా ప్రయత్నం ఫలించి తీరాలి. విధి నాకు అనుకూలంగా ఉండబట్టే ఇన్ని ఆపదలు గడిచి ఇంతదాకా రాగలిగాను. ఈ దశలో ఈ ప్రయత్నం విరమించను," అన్నాడు.

హసన్ పట్టు మంకుపట్టని ముసలిది గ్రహించింది. "అయేదేదో అవుతుంది. నీతోపాటు అవసరమైతే నేనూ నాశనమై పోతాను. అంతకన్న గత్యంతరం లేదు. వాక్ - వాక్ దీవులు ఏడూ, చక్రవర్తి కుమార్తెలు ఏడుగురి ఆధీనంలోనూ ఉన్నాయి. ఇది పెద్ద కుమార్తె దీవి. ఆమె పేరు నూరల్ హుదా. నీ సంగతంతా ఆమెకు చెప్పి ఎలాగైనా ఆమెను నీపట్ల సుముఖురాలిని చేసి ఇప్పుడే వస్తాను," అని ముసలిది వెళ్ళిపోయింది.

నూరల్ హుదా ముసలిదాన్ని చూస్తూనే మర్యాదగా లేచి, ఆమెకు ఆసనం చూపించి కూచోమని, "ఏమైనా మంచి వార్త తెచ్చావా? లేక ఏదైనా కోరటానికి వచ్చావా? అడుగు, ఇచ్చేస్తాను," అన్నది.

"మహారాణీ, నా చిట్టితల్లీ! ఇవాళ ఒక వింత జరిగింది. అది వింటే నువ్వు పగలబడి నవ్వుతావు. ఒక యువకుడు



ఎలా వచ్చాడో మన తీరాన వచ్చి పడ్డాడు. అతను ఏడుస్తూ నా కంట పడేసరికి అతని విషయం అడిగాను. విధి తనను ఇక్కడికి ఈడ్చుకువచ్చిందనీ, తాను తన భార్యను వెతుకుతున్నాననీ చెప్పాడు. అతను తన భార్యను వర్ణించాడు- ఆ వర్ణన చూస్తే నీవో, నీ చెల్లెళ్ళలో ఒకరో అయి ఉండా లనిపించింది. అతను కూడా, మానవుడే అయినప్పటికీ, అసాధారణ సౌందర్య వంతుడు,'' అన్నది ముసలిది.

నూరల్ హుదా చప్పున మండిపడి, ''ముసలిపీనుగా, పాపిష్ఠిదానా! మన ద్వీపం మీదికి మగవాణ్ణి ఎలా రానిచ్చావు? నీ రక్తం తాగి నీ కండలు పీక్కు తింటాను! నీ పీక నులిమేసే ముందు ఆ మనిషిని ఒకసారి చూస్తాను, వాణ్ణి పట్టుకు రా! వాడు మన దీవిపై అడుగు పెట్టి దాన్ని అపవిత్రం చేశాడు,'' అన్నది.

''ఈ అబ్బి నా ప్రాణం మీదికి తెచ్చాడు,'' అని ముసలిది గొణుగుతూ, భయంతో తత్తరపడిపోతూ హసన్ వద్దకు వెళ్ళి, ''జీవచ్ఛవమా, బయలుదేరి రా! నిన్ను మా రాణిగారు చూస్తారట!'' అన్నది. ''నాకేం మూడనున్నది?'' అనుకుంటూ హసన్ ఆమె వెంట బయలుదేరాడు.

వారు వచ్చేసరికి నూరల్ హుదా మేలి ముసుగు ధరించి ఉన్నది. హసన్ ఆమెకు ప్రణామాలు చేసి, ఆమెపైన పద్యాలు కూడా చదివాడు. చక్రవర్తి కూతురు అంతా విని, ప్రశ్నించమన్నట్టుగా ముసలి దానికి సైగ చేసింది. ముసలిది హసన్ కేసి తిరిగి, ''మహారాణివారు అడుగు తున్నారు. నీ పేరూ, నీ భార్య పేరూ, నీ పిల్లల పేర్లూ చెప్పు,'' అన్నది.

హసన్ చక్రవర్తి కూతురి కేసి తిరిగి, ''మహారాణీ, నేను హసన్ అనే దౌర్భా గ్యుణ్ణి. నాది ఇరాక్ దేశంలో బస్రా నగరం. నా భార్య పేరు నాకు తెలియదు. నా కొడుకులకు నాసిర్, మన్సూర్ అని పేర్లు పెట్టుకున్నాం,'' అన్నాడు.



నీ భార్య నిన్ను ఎందుకు వదిలిపోయిందని అడిగితే హసన్ తనకు తెలియదన్నాడు; కాని ఆమె మనస్ఫూర్తిగా తనను వదిలి ఉండదన్నాడు. ఆమె బయలుదేరింది బాగ్దాదులోని ఖలీఫా భవనం నుంచి అనీ, ఎగిరిపోవటానికిగాను ఆమె పక్షి ఉడుపు ఉపయోగించిందనీ, వెళ్ళిపోయేటప్పుడామె తన తల్లితో తాను వాక్-వాక్ దీవులలో ఉంటానని చెప్పిందనీ కూడా హసన్ చెప్పేశాడు.

అంతదాకా మౌనంగా ఉన్న నూరల్ హుదా, "నీ భార్యకు నీపై ప్రేమ లేకపోతే తానుండేచోటు చెప్పి ఉండదు; నీపైన ప్రేమ ఉంటే నిన్ను విడిచి వెళ్ళిపోయి ఉండదు," అన్నది.

తన భార్య తనను గాఢంగా ప్రేమించినట్టు లక్ష నిదర్శనాలున్నాయనీ, ఎగరాలన్న కోరికచేత వివశురాలై ఆమె వెళ్ళిపోయిందనీ హసన్ చెప్పాడు.

ముసలిది కూడా ధైర్యం తెచ్చుకుని చక్రవర్తి కూతురి కాళ్ళపై పడి, "మహారాణీ, నిన్ను పెంచి పెద్దదాన్ని చేసిన నా మొర ఆలకించు. ఈ అభాగ్యుణ్ణి శిక్షించకు, ఇతను ఇన్ని కష్టాలూ గడిచి దేవుడి దయచేతనే ఇక్కడికి చేరాడు. మనం ఇతన్ని అతిథిగా చూడటం భావ్యం. ఇతను చేసిన తప్పులు భార్యపై గల ప్రేమతో చేసినవి; వాటిని క్షమించవచ్చు. అదంతా అలా ఉంచి ఇతను చక్కని ఆశుకవిత్వం చెబుతాడు. ఒకసారి మేలి ముసుగు తొలగించి నీ ముఖం చూపించావంటే అద్భుతమైన పద్యాలు అల్లుతాడు," అన్నది.

హసన్ ఎలాటి కవిత్వం చెబుతాడోనని నూరల్ హుదా కుతూహలపడి తన ముఖానికి ఉన్న మేలిముసుగు తొలగించింది. హసన్ ఆమె ముఖం చూస్తూనే కెవ్వున కేక పెట్టి మూర్ఛపోయాడు.

చక్రవర్తి కుమార్తెను చూస్తూనే మూర్ఛపోయిన హసన్‌ను వృద్ధయోధకన్య సేదదేర్చి, అతని వికారానికి కారణ



మడిగింది. ''ఈమె ముమ్మూర్తులా నా భార్యే కాని, నా భార్య మాత్రం కాదు!'' అన్నాడు హసన్ ఆవేదనతో.

ఈ మాటకు చక్రవర్తి కూతురు పగల పడి నవ్వి, ''ఈ మనిషికి నిశ్చయంగా పిచ్చే! ఏమోయ్? నీ మాటలను బట్టి చూస్తే నీ భార్యకూ నాకూ చాలా పోలికలున్నట్టున్నది. కొంత తేడా కూడా ఉన్నట్టున్నది. పోలికలేవి? తేడా ఎందులో?'' అని అడిగింది.

''మహారాణీ, మీకూ నా భార్యకూ ఏ అవయవంలోనూ తేడా లేదు. కాని మీ ఇద్దరికీ తేడా ఉన్నది. దాన్ని నేను గ్రహించగలను గాని వివరించలేను,'' అన్నాడు హసన్. ఈ మాటతో చక్రవర్తి కూమార్తెకు రెండు విషయాలు స్పష్టంగా తెలిసిపోయాయి—ఈ అందగాడి మనసు తన కేసి రాదు; ఇతని భార్య తన ఆరుగురు చెల్లెళ్ళలోనూ ఒకతె అయి ఉండాలి. ఆమెకు హసన్ పైనా, అతని ప్రేమకు పాత్రురాలైన తన చెల్లెలి పైనా పట్టరాని ఈర్ష్యా, కోపమూ పుట్టుకొచ్చాయి. తన చెల్లెళ్ళలో ఇతని భార్య ఎవరో తేల్చుకుని, దాన్నీ ఇతన్నీ కూడా క్రూరంగా శిక్షించటానికి ఆమె నిశ్చయించుకున్నది.

ఆమె ముసలిదాని కేసి తిరిగి, ''ఓసీ, నీవు ఇక్కడున్నట్టుగా మిగిలిన ఆరు దీవులకూ వెళ్ళి, నా ఆరుగురు చెల్లెళ్ళనూ పిలుచుకురా. వాళ్ళను చూడగోరుతున్నానని చెప్పు. చెప్పి నీ వెంట తీసుకురా. ఈ యువకుడి సంగతి ఏమీ చెప్పకు సుమా!'' అన్నది.

ముసలిదానికి తన యజమానురాలి ఎత్తు అర్థం కాలేదు. అందుచేత ఆమె అతి శీఘ్రంగా ఒక్కొక్క దీవికే వెళ్ళి, ఒక్కొక్క చక్రవర్తి కుమార్తెనూ వెంట తీసుకుని, చక్రవర్తి ఆఖరు కుమార్తె వద్దకు వచ్చింది. హసన్ భార్య ఈ కుమార్తే. ఈమె పైన గల మమకారంతో గంధర్వ చక్రవర్తి ఈమె దగ్గిరే ఉంటున్నాడు.

తన కడగొట్టు కూతురు వెళ్ళిపోవటానికి ఆయన అభ్యంతరం చెప్పాడు. తనకేవో దుశ్శకునాలు కనిపించాయని చెప్పి ఆయన తన చిన్న కుమార్తెను వెళ్ళవద్దన్నాడు.

''నా కోసం మా అక్క నూరల్ హుదా విందు సిద్ధం చేసి పిలిపిస్తే వెళ్ళకుండా ఎలా, నాన్నా? నే నామెను చూడబోయి రెండేళ్ళయింది. ఇప్పుడు కూడా రానంటే ఆమెకు కోపం వస్తుంది. నా కేమీ భయం లేదు. ఒకప్పుడు నేను చాలా కాలం కనిపించకపోతే ఏమయానో అని నీవు దిగులు పడ్డావు. అయినా నేను తిరిగి వచ్చానుకానా? ఈ సారి దూరం వెళ్ళటంలేదాయె, మన దీవులలోనేకద!'' అన్నది హసన్ భార్య తన తండ్రితో.

ఆమె తన అక్క వద్ద కొద్ది రోజులు మాత్రమే ఉండి తిరిగివచ్చే షరతు మీద తండ్రి ఆమె వెళ్లటానికి అనుమతించాడు. ముసలిది ఆరుగురు అప్పచెల్లెళ్ళనూ వెంటపెట్టుకుని నూరల్ హుదా వద్దకు బయలుదేరింది. తన చెల్లెళ్ళు వచ్చే లోపుగా నూరల్ హుదా ప్రత్యేకమైన దుస్తులూ నగలూ ధరించి, మెరిసిపోతూ సింహాసనం పైన ఠీవిగా కూచున్నది. ఆమె కెదురుగా హసన్ దీనవదనంతో నిలబడి ఉన్నాడు. అతన్ని యోధకన్యలు విచ్చు కత్తులతో కాస్తున్నారు.

ముసలిది వచ్చి తన చెల్లెళ్ళు వచ్చారని చెప్పగానే ఆమె ఒక్కొక్కరినిగా తన వద్దకు పంపమని ఉత్తరువిచ్చింది. పెద్ద చెల్లెలు వచ్చింది. నూరల్ హుదా ఆమెను పలకరించి తన సరసను కూచోబెట్టుకుని, హసన్‌ను సంబోధిస్తూ, ''మానవుడా, ఈమె నీ భార్య అవుతుందా?'' అని అడిగింది.

''ఈమె సౌందర్యం సాటిలేనిది, వర్ణనాతీతం. అయినప్పటికీ ఈమెకూ, నా భార్యకూ వ్యత్యాసం ఉన్నది. దానిని నేను మాటలతో వివరించి చెప్పలేను,'' అన్నాడు హసన్.

—(వచ్చే సంచికలో ముగింపు)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 ఆగష్టు నెల సంచికలో ప్రకటింపబడును.







Devidas Kasbekar — A. L. Syed

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూన్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అంతా నిశ్శబ్దం

రెండవ ఫోటో : మొదలవుతుంది చిత్రం

పంపినవారు : మీర్జ ఎగ్బాల్ హసన్, నగరం. (తూర్పుగోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

అదనపు బలాన్ని ఇచ్చే
అదనపు శక్తి

క్వాలిటీ
గ్లూకోజ్

శక్తి నిచ్చేవి కమ్మని
రుచికరమైనవి

KWALITY glucos BISCUITS

CAS/KBPL/81126

క్వాలిటీ గ్లూకోజ్
బిస్కట్లు ఆధునిక పద్ధతిలో
మేలురకమైన మిశ్రమ పదార్థాల
మేలు కలయికతో తయారు చేయబడినవి.
అత్యున్నత ప్రమాణాలు కలిగినవి. కరకరలాడేవి
మరియు పుష్టికరమైనవి.




క్వాలిటీ
బిస్కట్స్ ప్రై. లి.
బెంగుళూరు-560 039.

**క్వాలిటీస్**
**గ్లూకోస్ బిస్కత్తులలో బంగారం**

**Results of Chandamama—Camlin Colouring Contest No. 23 (Telugu)**

*1st Prize:* Kola Samba Siva Rao, Poranki-521 137. *2nd Prize:* T. Sunita Devi, Hyderabad-500 659. *3rd Prize:* G. Pranitha, Orissa-765 017. *Consolation Prizes:* K. Narendra Kumar, Tangutur. D. Shailesh Kumar, Warangal-506 012. T. Saiamrutalakshmi, Vijayawada-520 001. D. Srinivasa Rao, Vijayawada-520 016. Golischandra Rao, Vijayawada-520 015.

